ఏప్రిల్ నెల

# వెరైటీ

సంచికలో



ఫ్రెంచి శృంగార నవల!

## నానా

NANA
By EMILE ZOLA

సత్య



సాయిబాబాపై విమర్శల పర్వం!

ఆడవాళ్ల అందాల ద్వీపం!

వశీకరణ మీరూ చేయవచ్చు!

లింగపూజ ఎలా వచ్చింది?

సంతానం కలిగే ఆధునిక చికిత్స!

మీ పిల్లల్ని పొడుగు ఎదిగించే మందు వచ్చింది!

సినీ తారలకు ప్రభుత్వ పదవులు!

ఎందుకు భర్తలు పడుపుకత్తెల వెంట పోతారు?



నోబుల్ బహుమతి హెమింగ్వే నవల

వృద్ధుడూ-సాగరమూ

VARIETY IV-0-41, Lal Bahadur Stadium, HYDERABAD-1




## ముఖచిత్రం

తేది 26-3-82 కమలహాసన్, మాధవి ముఖచిత్రముతో వెలువడిన మీ (మా) పత్రికైన ఆంధ్రసచిత్ర వారపత్రిక కడురమ్యంగా ఆకర్షణీయంగా ఉంది.

డి. గురుమూర్తి వర్మ [బైపల్లి]

*　*　*

కమల్ హాసన్, మాధవి ముఖచిత్రంతో పత్రిక కన్నుల విందుగా ఉంది.

చింతా రంగనాయకులు [ధర్మవరం]

*　*　*

కమలహాసన్, మాధవి ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది. ఇంతటి అందమయిన ముఖచిత్రం ఈ మధ్య మీరు ప్రచురించలేదు. ఇటువంటి ముఖచిత్రాలకు యిదేమా సుస్వాగతం.

విజయశ్రీ [ఆదోని]

## కథలు

26-3-82 ఆంధ్ర సచిత్రవారపత్రికలో నాకు లొసుగుల గొలుసు కథ చాలా నచ్చింది. మానవత్వాన్ని మేలుకొల్పింది.

ఆకెళ్ల సుబ్బారావు [కందికుప్ప]

26-3-82 పత్రికలో లొసుగుల గొలుసు కథ మనిషి 'మనుగడలో ఈ జీవన యానంలో ఎదుటి మనిషిలో తప్పులు వెదికే మనుష్యులలో మార్పురావలి. మార్పు కావాలి. ఈ కథలో చక్కని సందేశాన్ని అందించారు.

పులపర్తి శ్రీరంగి [మొగల్తూరు]

*　*　*

26-3-82 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక గెటప్ బాగుంది. లొసుగుల గొలుసు, శ్రీమూర్తి అన్న కథలు వాస్తవానికి దగ్గరగా వున్నాయి.

వై. హేమసుందర్ రావు, హేమబిందు, ప్రియ [డోర్నకల్]

*　*　*

మార్చి 26వ తేదీ మీ [మా] పత్రిక కమలహాసన్, మాధవిల ముఖచిత్రంతో ఆకర్షణీయంగా వుంది. ఈ వారం కథలన్ని వెరైటీగా ఉన్నాయి. శ్రీమూర్తి కథ బాగా వచ్చింది. రచయిత గంగుల నర్సింహారెడ్డి రామలక్ష్మమ్మ పాత్రను చాలా చక్కగా తీర్చిదిద్దారు.

ఎం. నాగేశ్వరరావు, ఎం. బాబూరావు [బైపల్లి]

త్వరలో ప్రారంభం!
కొత్త సీరియల్

# ఏడడుగులు

రచన:
'విశాఖ'

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు:
[1938 - 1972]
శుక్రవారం : 23-4-'82
దుందుభినామ సం. చైత్ర బ. అమావాస్య
సంపుటము 75 : సంచిక 33
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్ట్‌లో ఏడాది చందా రు 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడి ప్రతి వెల రు. 1-25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం. విజయవాడ-520 003

## విషయానుక్రమణిక







# ఆపదలో ఆత్మీయుడు



**ప్రాణభారాన్ని మోయక తప్పదన్నట్టుగా** భూదేవిలా సహనం వహిస్తూ తారు రోడ్డు పై పోతున్న ఆర్. టి. సి. బస్సు. పాపం కండక్టర్ కుస్తీ పట్టు పడుతున్నాడు ప్రయాణీకులతో. అరుస్తున్నాడు. విసుక్కుంటున్నాడు. డ్రైవర్ తనకేమి సంబంధం లేనట్టుగా పట్టువదలని విక్రమార్కుడిలా, సామాన్య ప్రజానీకం ఆకాశాన్ని అంటివున్న ధరలను అందుకోలేక అల్లాడి ఆకులుమేస్తూ వుంటే, ఎయిర్ కండీషన్డ్ గదులలో నివసిస్తూ, ఇంపోర్టెడ్ ఏ. సి. కార్లలో ప్రయాణిస్తూ వినోదిస్తున్నవాడిలా, గమ్యస్థానం చేరాలనే పట్టుదల వున్న బాటసారిలా ఏకదీక్షతో ముందుకే చూస్తూ నడుపుతున్నాడు బస్సు.

“రాములోరిపురం” అంటూ గట్టిగా కేకవేసి చేతిలోని టికెట్స్ క్లించ్‌తో స్తంభానికి గణగణమంటూ వాయించాడు

కండెక్టర్ తపోభంగము కల్గిన మహర్షిలా ఒక్కసారిగా పాదాన్ని బ్రేక్‌ను అదుముకు తొక్కాడు భూకంపం వచ్చి భూమి అదిరి నట్లుగా మనుషులందరూ అటు నుండి ఇటు వైపోసారి, వెనుక సీట్లలోని వారిని ముందు సీట్లకు గుద్దుకునేలా చేసి ఏమీ తెలియ నట్లుగా ఆగిపోయింది. ప్రయాణికులు తమకు తెలిసిన భాషలో ముద్దు ముద్దుగా దీవించారు డ్రైవర్‌ను.

ఆలస్యం అమృతం విషమని తెలిసినా, ఆ పెద్దలు చెప్పిన విధానమే ప్రధానం అన్న నానుడిని గుర్తుకు తెస్తున్నట్లుగా సీట్ల క్రిందకు తోసిన తమసామాన్లను తాపీగా లాక్కొని అన్నీ వున్నాయా లేదాని చెక్ చేసుకొని ఆర్. టి. సి. వారి సేవను కొనియాడుతూ దిగిపోయారు ప్రయాణీకులు.

బస్సు మరొకసారి ఘర్జించి సింహ రాజంలా జూలు విదుల్చుకొని కదిలింది ముందుకు ఇదంతా పరిశీలిస్తున్నాడు శేషగిరి సీటులో కూర్చుని. కిటికీ ప్రక్కనే తన సీటు అయినందువలన తలని బయటి వైపు తిప్పాడు. ఆ గ్రామం దాటుతున్నది బస్సు. పొలాలలో మనుషులు అలసట అనేది తెలియక కష్టపడుతున్నారు. బీడు పడిన పొలంలో పశువులను అదిలిస్తున్నాడు చినిమి దేళ్ళ కుర్రాడు. ఒక అవు పొలం వైపు వెళుతూంటే క్రిందికి జారిపోతున్న మాసిన నిక్కరును పైకి లాక్కుంటూ కర్ర చేతిలో పట్టుకొని పరుగెడుతున్నదృశ్యంకంటబడింది

శేషగిరి కళ్ళముందు మరో దృశ్యం మెదిలింది లీలగా. చెరువులోని నీళ్ళలో పిముముపై కూర్చొని సంతోషంతోఅరుస్తూ ముక్కులోనుండి కారుతున్న చీమిడిని చిడమ చేత్తో తుడుచుకొని అప్యాయంగా తడిసిన నిక్కరుకు తుడుచుకుంటూ సర్వప్రపంచాన్నీ మరచిపోయి తోటి పిల్లలతో కలిసి కేరింతలు కొడుతున్నాడు.

బస్సు హారన్‌తో చెదిరిపోయిందా దృశ్యం. పెదవులపై అనుకోకుండా చిరు దరహాసం మెరిసి మాయమయ్యింది.

"ఏందయ్యో! వెల కూడా కాలేదు నాను అదే వూరికి పోయి. అప్పుడు రూపాయిపావలా తీసుకున్నారు. ఇప్పుడు నీవేందో రూపాయిన్నర అంటున్నావ్, నాతో రూపాయి పావలా తప్ప పైసా ఎక్కువలేదు. ఇప్పుడెక్కడ మండి తెమ్మంటావ్."

తలతిప్పి మాటలు వినిపించిన వైపు చూశాడు శేషగిరి. ఓ ముప్పయి సంవత్సరాల స్త్రీ చంకలో రెండేళ్ళ పసిపాపను ఎత్తుకొని వుంది.

"చూడమ్మా! గవర్నమెంట్ రేట్లు పెంచింది. అంతేగాని నీ పావలా కొట్టే యాలనికాదు. నా చేతినుండి వేసుకుంటే నీలాంటి వాళ్ళు నలుగురు తగిలితే నా పని సరి. ముందు స్టేజీకే టికెట్ ఇస్తాను. అక్కడ దిగిపో" అన్నాడు కండెక్టర్.

"మధ్యలో దిగిపొమ్మంటే ఎలాగయ్యా! ఆడముండని. అందులో పసిపిల్ల వుందాయె. ఈసారికి ఎలాగో అలా మావూరికాడి దింపు. నీకు పుణ్యముంటుంది" అందామె భయంగా అభ్యర్థనగా.

"అది కుదరదమ్మా! నేను నీపై జాలి చూపినా గౌర్నమెంటోళ్ళు నాపై దయ చూపరు... తేతే డబ్బులు..."

అంతా విన్న శేషగిరి జేబులో నుండి పావలా తీసి "కండెక్టర్! మిగిలిన డబ్బు వేసిస్తానుగాని ఆమె వూరికే టికెట్ ఇవ్వు" అంటూ డబ్బులిచ్చాడు కండెక్టర్‌కు టికెట్ చించి ఆమెకిచ్చి "ఇంకా ఎవరండీ టికెట్. ఇంకా ఎవరు తీసుకోవాలి" అంటూముందుకు కదిలాడు.

శేషగిరి ఆలోచించసాగాడు.ఆ ఆలోచనల్లో గతం కళ ముందు నిలిచింది.

* * *

"రామయ్యా! నేను చెబుతున్నది అబద్ధం అంటావా! అవసరం అంటూ నాలుగు వేల రూపాయలు బాకీ తీసుకెళ్ళి రెండు వేలే అంటావా ఇప్పుడు? బాకీ పత్రం నివరితో నయినా చదివించు. ఇంత బ్రతుకు బ్రతికి ఇంతెనకాల వచ్చినట్లు నేనబద్ధం చెప్తానను కున్నావా?" అన్నాడు హుంకరిస్తూ భూషయ్య.

ఓ ప్రక్కగా చేతులు కట్టుకొని నిల్చున్నాడు దీనంగా రామయ్య. తండ్రి ప్రక్కనే నిలబడి చూస్తున్నాడు చిట్టిగాడు.

ఆనాడు వాకేం తెలియని పసి వయసు. భూషయ్యచేస్తున్న అన్యాయాల్ని అరికట్టడం తెలియని వాడిని. అందుకే తన తండ్రిని అమాయకుడినిచేసి మోసం చేశాడు. నాలుగు వేలకు పత్రం వ్రాసి చదువు రాని తన తండ్రితో వేలిముద్ర వేయించుకున్నాడు.

"అయ్యా! అంతమాట అనకండి. నేను తీసుకెళ్ళింది రెండువేలే కాని మీరు నాలుగు వేలని దగాయిస్తున్నారు. నాకేం అర్థం కావడంలేదు. మరోసారి పత్రం నాదో కాదో చూసి చెప్పండి" అన్నాడు రామయ్య.

"రామయ్యా! ఇది నీ పత్రమే. కావాలంటే ఎవరయినా చదువొచ్చిన వాళ్ళకు చూపిద్దాం ..." అంటూ వీధిలోకి వచ్చి చూశాడు. ప్రకాశం పంతులు వెళుతూ కనిపించాడు. "ఓ పంతులూ ... కాస్త ఇలా రండి" కేక వేసి పిలిచాడు. పంతులు వచ్చాక "పంతులూ ... ఈ పత్రం చదివి రామయ్యకు చెప్పండి" అని చేతికిచ్చాడు పత్రం. ప్రకాశం పత్రం అందుకొని చదివి "రామయ్యా! ఇందులో నీవు నాలుగు వేలు బాకీ తీసుకున్నట్లుగా వుంది" అని చెప్పాడు.



"అయ్యా పంతులు, ఇదంతా అన్యాయమయ్యా. నేను రెండు వేలు తీసుకున్నాను. నన్ను మోసం చేశాడు భూషయ్య. చదువు రానోడినని ఇంతపని చేయొచ్చునా! అయినా మీరేం చేస్తారు. వ్రతంలో వున్నట్లు కట్టక తప్పదు. అలాగే కానీయండి భూషయ్యగారు. మళ్ళా కనబడతా. రారా చిట్టి వెళదాము" అంటూ బయటికి నడిచాడు. రామయ్య వెంట పంతులు వీధిలోకి వచ్చాక "రామయ్యా! అప్పు తీసుకునేటప్పుడు ఎవరయినా చదువుకున్న వాళ్లను పిల్చుక పోకూడదు" అన్నాడు.

"నాకేం తెలుసండి పంతులు గారు. అయినా దేవుడు పెడపాలి గాని ఈడు పెడిపితే పెడతానా! ఏదో ఓ యేడు పంటలో నష్టం వచ్చిందని అనుకుంటాను" అన్నాడు రామయ్య.

## ఆపదలో ఆత్మీయుడు

"రామయ్యా! ఈడు నీ కొడుకేగా?" అడిగాడు సందేహంగా చూస్తూ చిట్టిగాడి వైపు. 'ఆ చూపు ఈనాడు నన్నీస్థితికి తెస్తుందని అనుకోలేదేనాడు.'

"అవునయ్యా! ఈ డొక్కడే..."

"బడికి పంపుతున్నావా?"

"లేదయ్యా! పసులు కాయడానికి పంపుతున్నా" అన్నాడు అమాయకంగా రామయ్య.

"రామయ్యా! వీడ్ని చదువు కోడానికి పంప కూడదూ."

"ఎందుకయ్యా! మాకు చదువులు. ఇంటి పనులు, పొలం పనులు చూసుకోడానికి ఎవరున్నారు. వీడొక్కడేగా కొడుకు. వెంటేసు కొని పన్ను నేర్పితే చేతి కందివస్తాడు. దేవుడిచ్చిన భూమిని పండించుకుంటే చాలు. రెక్కలకష్టం వుంటే చాలు. మా బ్రతుకులు ఇలా సాగిపోతే చాలు" అన్నాడు రామయ్య. చిట్టి తండ్రి వంక, మాష్టరు వంకా తన విషయమే మాట్లాడుతూ వుంటే కుతూహలంగా చూస్తూ వింటున్నాడు.

ఆ సంభాషణ నా జీవితానికి బంగారు బాట అవుతుందని ఊహించలేదు ఆనాడు. నాన్నకు తన పనిలో విశ్వాసం, రెక్కల కష్టంపై ధైర్యం వుంది. ఒకడికి తలవంచే దేమిటి అన్నంత ధీమా వుంది. కాని మనిషికి ఏది ముఖ్యం అనేది తెలుసుకోక పగలు రాత్రి కష్టపడటం తెలుసు. కాని ఆలోచనాజ్ఞానం లేదు. అదే తెలిసి వుంటే ఆనాడావిధంగా మోసపోకపోను.

"రామయ్యా! నీవు చెప్పింది బాగానే

వుంది కాని ఈ దినం ఓ సంగతి తెలుసుకున్నావా?''

"ఏంటయ్యా, ఆ సంగతి?'' అమాయకంగా ప్రశ్నించిన రామయ్యను చూసి తనలో తానే జాలిపడ్డాడు ప్రకాశం.

"అంటే తెలుసుకోలేకపోయావన్నమాట. అదే నీకూ, చదువుకున్న వాడికీ వున్న భేదం. నీవు చదువుకోలేదు కాబట్టేగా రామయ్యా నిన్ను భూషయ్య మోసం చేసింది. నీవు చదువుకొని వుంటే ఈ పని జరిగేదా?'' అని అడుగుతున్న మాష్టారువంక ఆశ్చర్యంగా చూశాడు రామయ్య.

* * *

మాష్టారు మాటల్లో ఎంత నిజంవుందో ఆనాడు తెలుసుకోలేక పోయాము. ప్రక్క సీటులోని అతను టయిం అడిగాడు. వాచీ చూసుకొని బదులు చెప్పి సీటుకు ఆనుకొని కళ్లు మూసుకున్నాడు శేషగిరి.

* * *

"అప్పయ్యగారూ నేనాదినం రామయ్యా ఈడ వేలుబొట్టు వెయ్యి'' అంటే ఆడ వేలుబొట్టు వేసినాను కాగితంమీద. అదే ఈదినం ఇంతపని చేసింది. సదువుకోకుంటె ఎంత నష్టమో ఇప్పుడు తెలుసుకున్నాను పంతులూ. చిట్టిగాడిని తప్పకుండా బడికి పంపుతాను. ఎలాగోలా పొలం పనులు చూసుకొంటాను. ఓ జీతగాడిని పెట్టుకుంటే పనులు జరిగిపోతాయి'' అన్నాడు రామయ్య.

"మంచిది రామయ్యా! నా మాటకు విలువిచ్చావు. సంతోషం. రేపు నీ కొడుకుని వెంటపెట్టుకొని బడికిరా'' అంటూ బడి దగ్గరవడంతో అటువైపు వెళ్ళాడు ప్రకాశం పంతులు.

* * *

ఒక్క కుదుపుతో ఆగింది బస్సు. తూలి ముందు సీటుకు కొట్టుకోబోయి చేయి అడ్డం పెట్టాడు శేషగిరి. కండెక్టర్ అరుస్తున్నాడు. "దిగండయ్యా...తొందరగా దిగండి... ఇంత ఆలస్యం చేస్తే ఎలా...? మీరు ఆగండయ్యా కాస్త. బస్సులోని వారు దిగని...'' అయినా అతని మాటలు వినేవారెవ్వరు. ప్రజా ప్రభుత్వం కదా మనదేశం. స్వతంత్రులం కదా మరి. అందుకే దిగేవారు దిగకుండా ఎక్కేవారు తోసుకొని మరీ ఎక్కుతున్నారు. నానా తంటాలు పడి చివరి

మార్గంలో వారు చేరుకున్నాక బస్సు బయలు దేరింది.

టైం చూసుకున్నాడు శేషగిరి నాలుగయ్యింది. ఎండ వాడ్పు తగ్గింది కాస్త. 'ఇంకా గంట ప్రయాణం, తను చేరాల్సిన ఊరుకి' అనుకున్నాడు మనసులో

* * *

"ఒరే చిట్టి! పంతులుగారింటికెళదాం పదరా!'' అన్నాడు వెదురు బుట్టను భుజం మీది కెత్తుకుంటూ రామయ్య.

చిట్టిగాడ్ని బడిలో వేసేటప్పుడు ప్రకాశం పంతులుగారే ఆ పేరు బాగాలేదని శేషగిరి అని వ్రాయించాడు రిజిష్టర్‌లో. స్కూల్లో శేషగిరి అని పిలిచినా ఇంట్లో మాత్రం అమ్మా నాన్న 'చిట్టీ' అనే పిలుస్తారు.

"ఏం రామయ్యా! ఇలా వచ్చావు. ఏంటి భుజం మీద బుట్ట'' అని అడిగాడు.

"ఏం లేదయ్యా! పొలంలో పండినవి. మా ఇంటిది మీ ఇంట్లో ఇచ్చిరమ్మని బీరకాయలు, చిక్కుడు కాయలు పంపింది'' అంటూ వసారాలో పెట్టాడు బుట్టని.

"పంతులు! చిట్టిగాడు ఇంకా సదువుతా నంటున్నాడు. ఈ వూర్లో సదువు అయిపోయింది గదా! నాకు పట్నంలో విషయాలు తెలియవు. నాకూ ఆడ్ని చదివించాలని వుంది. మీరు కాస్త ...'' ఆపాడు రామయ్య.

"రామయ్యా! మంచి నిర్ణయం తీసుకున్నావు. నీ బిడ్డడి భవిష్యత్‌ను చక్కగా తీర్చిదిద్దుకునే నీ ప్రయత్నానికి నా అండ

ఎప్పుడూ ఉంటుంది. పట్నంలో ఇంటర్‌మీడియట్ చదవడానికి రెండేళ్లు పడుతుంది. మధ్యలో చదువు ఆపి వేయవద్దు అలాగయితేనే చదివించు'' అన్నారు మాష్టారు.

"అలాగేనయ్యా ఆడు ఎంత సదువుకుంటాను అంటే అంత సదివిస్తాను'' అన్నాడు.

"మరొక్క విషయమయ్యా! చిన్నప్పుడు మురికి పట్టిన గుడ్డల్లో, చింపిరి జుత్తుతో చూడ్డానికే అసహ్యంగా వుండేవాడు. మీ చలువవల్ల నా బిడ్డ దొరబాబులా వున్నాడు. వీడ్ని ఇట్టాగే చూసుకోవాలని నా ఆశ. అందుకే ఆడ్ని ఎంతయినా సదివిస్తాను'' అన్నాడు సంబరపడిపోతు దృఢంగా రామయ్య.

* * *

ఆ దినం తండ్రి ముఖంలో వెలుగుతున్న ఆశను చూసి పట్టుదలగా చదువుకున్నాను. తండ్రి ఆశను నిలబెట్టి తండ్రి కోరికను తీర్చగలిగాను.

* * *

"అలాగే రామయ్యా! నీ ఆశ తప్పకుండా నెరవేర్చుతాడు శేషగిరి, చాలా చురుకైన వాడు. బుద్ధిమంతుడు. వాడి చదువు విషయం నేను చూసుకుంటానులే'' అన్నాడు ప్రకాశం పంతులు

* * *

"యెల్లయ్య పాలెం! యెల్లయ్యపాలెం'' అని కండక్టర్ కీ బంచ్‌తో స్తంభానికి ధనాధనా వాయిస్తూ అరిచిన అరుపుకు తృళి పడి లేచాడు శేషగిరి. తాను దిగాల్సిన ఊరు



వెయిట్ లిఫ్టింగ్ మరీ అంత ఘోరంగా చెయ్యక్కర్లేదు గురూ.

# ఆపదలో ఆత్మీయుడు

ఇదేవని బ్యాగ్ చేతిలోకి తీసుకొని బస్సు దిగాడు. తల భారంగా వుంటే హోటల్ కెళ్ళి కాఫీకి ఆర్డరిచ్చాడు. టైం చూసుకున్నాడు. అయిదుంపావయ్యింది. కాఫీ త్రాగి బిల్లు చెల్లించి, బయటికి వచ్చాడు. జేబులో నుండి ఇన్‌లాండ్ లెటర్ తీసి ఫ్రమ్ అడ్రసు చూసుకొని మళ్ళీ ఉత్తరం జేబులో పెట్టుకొని బయలుదేరాడు.

ఓ ఇంటి ముందుకెళ్ళి తలుపు తట్టాడు శేషగిరి. కొద్దిసేపటికి తలుపు తెరుచుకొంది. ఎదురుగా ఓ పదేళ్ళ అమ్మాయి నిలబడి వుంది. గుండ్రటి ముఖం నిర్మలంగా స్వచ్ఛతకు మారుపేరు అన్నట్లుగా వుందా మ్మాయి. పదకొండేళ్ళ అమ్మాయి "అన్నయ్యా! అన్నయ్యా!" అంటూ ఆప్యాయంగా పిలిచే రూపం కళ్ళముందు క్షణం మెరిసి మాయమయింది.

"ఎవరు కావాలండీ?" అడిగిందామ్మాయి.

"నీ పేరు శాంత కదూ!" అడిగాడు శేషగిరి.

"అవును...ఇంతకు మీరెవరో చెప్పలేదు" అడిగింది సందేహంగా.

"నే నెవరో చెప్పకో చూద్దాం..." చిరునవ్వు నవ్వుతూ అడిగాడు.

"ఎవరమ్మా శాంతీ?" లోపలి నుండి ఆడమనిషి గొంతు అడిగింది.

"అదే అడుగుతున్నానమ్మా..." అంటూ శేషగిరి మొహం వంక పరీక్షగా చూడసాగింది. మెల్లగా తన బాల్యం జ్ఞాపకానికొచ్చింది. అందులో మనుషులు ఒక్కొక్కరే కనిపించి మాయమవ్వసాగారు. చివరికి చిట్టి అన్నయ్య జ్ఞాపకం వచ్చాడు. సందేహం తీరిందన్న ట్లుగా "మీరు శేషగిరి అన్నయ్య కదూ!" అంది.

"గుర్తు పట్టావన్నమాట. ఎలాగున్నా వమ్మా" అడిగాడు.

"బాగున్నానన్నయ్యా... రా లోపలికి" అంటూ చేతిలో సంచి అందుకొని "అమ్మా నర్సాపురం శేషగిరి అన్నయ్య వచ్చాడు" అంటూ హాల్లోకినడిచింది శేషగిరి దొడ్లోకి వెళ్ళి కాళ్ళు ముఖం కడుక్కొని వచ్చాడు లోపలికి. శాంత అందించిన టవల్‌తో ముఖం తుడుచుకోసాగాడు. లోపలి నుండి శారదమ్మ వచ్చింది హాల్లోకి. నిలువెత్తు పెరిగిన శేషగిరిని చూసి వింత నిదిగాడు అనుకొని "బాగున్నావా బాబూ. ఇంట్లో అమ్మా, నాన్నా బాగున్నారా" అడిగింది ఆప్యాయంగా.

"అందరూ బాగున్నారమ్మా! మాష్టారు ఎక్కడి కెళ్ళారు" అడిగాడు.

"ఎవరు శారదా వచ్చినట్టున్నారు" అంటూ ప్రకాశంగారు చేతి సంచీతో హాల్లోకి వచ్చారు.

"నేను మాష్టారూ... శేషగిరిని" అన్నాడు.

"వుత్తరం అందివుంటుందనుకుంటాను. బదులు వుత్తరం కోసం ఎదురుచూస్తుంటే మనిషే వచ్చావన్నమాట. కూర్చో" అంటూ తానో కుర్చీలో కూర్చొని "ఇంటికాడ అందరూ బాగున్నారా శేషగిరి" అడిగాడు.

"క్షేమమే మాష్టారూ... మీరు మా వూరి నుండి వెళ్ళిపోయి ఆరేండ్లు కావస్తున్నది. మీరెక్కడ వున్నారో తెలియక పోయింది. మీరు వ్రాసిన వుత్తరం చూశాక మిమ్మల్ని చూద్దామని వచ్చాను" అన్నాడు శేషగిరి.

శారదమ్మ, శాంత వంటింటి వైపు వెళ్ళారు.

"శేషగిరి! నీ చదువు ఎంతవరకొచ్చింది" అడిగాడు ప్రకాశం.

"క్రిందటేడే అగ్రికల్చర్ పూర్తి చేశాను మాష్టారూ. వుద్యోగాలు దొరకడంకష్టంగా వున్న రోజులలో ఎక్కడ వుద్యోగం దొరుకుతుందని, స్వంత వ్యవసాయం చేపట్టాను. నేను నేర్చిన వ్యవసాయ శిక్షణ ద్వారా ఆధునికపద్ధతులతో వ్యవసాయంచేస్తున్నాను. ఈ సంవత్సరం మంచి పంట పండింది మా వూర్లో. దానికి కారణం నా సలహాలు పాటించి మా వూరి వ్యవసాయదారులందరూ పంటలు పండించారు. మాజిల్లా కంతటికి రెండవ స్థానంలోకి వచ్చింది మా వూరు. ఈ కీర్తికి మీరే కారణం మాష్టారూ. అందుకే కృతజ్ఞత తెలుపుకుంటున్నాను" అన్నాడు ఆనందంగా శేషగిరి.

"మంచిది బాబూ! నేనుచెప్పిన చదువును సార్థకత చేసుకున్నావు. అదంతా నీ కృషి." తను నాటిన మొక్క ఎదిగి నలుగురికి వుపయోగ పడుతుండడం విని ఆనందంతో గర్వంతో హృదయం నిండిపోగా పలికారు ప్రకాశం పంతులు.

"మాష్టారూ! మీరిచ్చిన శిక్షణ వ్యర్థమవుతుందనుకున్నారా! లేదు మాష్టారూ. మీ నీడలో విద్యాబుద్ధులు నేర్చుకున్నవాడు ఎప్పుడూ చెడిపోడు. మట్టి పిసుక్కోవలసిన నాకు ఓ చక్కని మార్గం చూపించారు. నేను పెరిగినా వ్యవసాయం చేసేవాడిని. ఇప్పుడు చదువుకున్నా వ్యవసాయమే చేస్తున్నాను. కాని తేడా అంతా పాత పద్ధతులతో బొటాబొటీగా పండించుకొనే వాడిని. కాని ఈనాడు చదువుకున్న శిక్షణతో ఆధునిక పద్ధతులతో హెచ్చువుత్పత్తిని పెంచుతున్నాను. ఈ మార్పుకు కారణం మీరు మాష్టారూ... మీరు..." అన్నాడు వ్యథమైన కంఠంతో శేషగిరి. "మాష్టారూ... మీ లాంటి



మాష్టర్లు ప్రతి స్కూల్లోనూ వుంటే దేశాభ్యున్నతి ఏనాడో సాధించి వుండేది. నాలో ఈ సంస్కారాన్ని, బుద్ధిని ప్రసాదించింది మీరు. మీకు ఏమి చేసినా ఋణం తీరిపోదు. చెయ్యెత్తి దండం పెట్టినా మీ యొక్క విద్యాదానానికి, సంస్కారదానానికి సాటికాదు మాష్టారూ... సాటికాదు" అన్నాడు మళ్ళీ శేషగిరి.

"బాబూ శేషగిరి నీవు పొరపాటు పడుతున్నావు. నేర్చుకునే విద్యార్థిని బట్టి వుంటుంది అంతా. మాతో ఎంతోమంది విద్యార్థులు చదువుకుంటారు. అందులో వారి వారి కృషిని బట్టి కలెక్టర్ గానూ, లాయర్ గాను, సిపాయిలుగాను, నిరుద్యోగులు గానూ తయారవుతారు. మరికొందరు మూర్ఖులుగాను, సంఘ విద్రోహులుగానూ తయారవుతారు. అది వారి వారి కృషినిబట్టి నడుస్తుంటుంది. అంతేగాని మా గొప్పతనమేమీలేదు. నీలోకృషివుంది పైకొచ్చావు. మేము ఆశించేది మీరు గొప్ప వ్యక్తులు కావాలని, మేము నేర్పిన చదువుకు సార్థకత ఏర్పడాలనికోరుకుంటాము. ఫలానామాష్టారు గారి దగ్గర చదువుకున్నామని అంటే చాలు మాకు అదే గౌరవము. అంతకంటే మీ నుండి ఏదీ ఆశించము శేషగిరి." కాస్సేపు ఆగి మళ్ళీ చెప్పసాగాడు. "మీరుగొప్పవారయితే పొంగిపోతాం. దుష్టులుగాను, దౌర్భాగ్యులుగాను తయారైతే బాధ పడతాము. అంతకంటే మేమేం చెయ్యగలం చెప్పు శేషగిరి..."

మాష్టారు యొక్క మంచి మనసుకు శేషగిరి గుండెల నిండా భక్తిభావం నిండిపోయింది. మనసులోనే చేతులెత్తి దణ్ణం పెట్టుకున్నాడు.

"మాష్టారూ! మీరు మహోన్నతమైన మనుషులు. మీరు నలుగురిలో జ్ఞానజ్యోతిని వెలిగించడానికే ప్రయత్నిస్తారు గాని, జ్యోతి నుండి వచ్చే వెలుగును ఆశించరు. చీకటిలో వుండి పదిమందికి వెలుగును పంచడానికే ప్రయత్నిస్తున్నారు. ఇలాంటి మనస్సున్న మీ ముందు ఏ మనిషి ఉత్తముడు కాకపోడు. దేశానికి ఆయువు పట్టులైన వటువంటి యువతనున్నతమైనమార్గంలో నడపడానికి మీ శక్తినెంతో ధారపోస్తున్నారు. ఇలాంటిమిమ్ములను ఈసమాజంగుర్తించడం లేదు. మీ బాగోగులను పట్టించుకోవడం లేదు. దేశానికి చీడపురుగుల లాంటి వ్యక్తులను, దేశాన్ని దోచుకొని నీతి వాక్యాలను వల్లించేవారిని ఆదరించి జేజేలు పలుకుతుంది సంఘం. మీ శక్తిని గుర్తించడం లేదు. అంతెందుకు మాష్టారూ మీ శక్తిని మీరే గుర్తించలేరు. పరోక్షంగా మీ శక్తినంతా ధారపోస్తున్న మహా పురుషులు మీరు మాష్టారూ...మహా పురుషులు."

"బాబూ! నీకు నా పై వున్న గౌరవం అలా అనిపిస్తుంది. అంతే బాబూ! అంతే."

"ఏమండీ...! అబ్బాయి, మీరు చేతులు కడుక్కొని రండి టిఫెన్ తిందురు గాని" పిలిచింది వంటింటిలో నుండి శారదమ్మ.

* * *

"ఏమండీ! వారేమన్నారు ?"

"ఏమంటారు శారదా ... వారికి కావలసినంత మనం ఇవ్వలేం"

"ఎంతడిగారండీ... ?"

"పదైదువేలు అడిగారు శారదా...వున్నది పదివేలు– పెళ్ళి ఖర్చులకు సుమారుగా అయిదారు వేలయినా కావాలి. అంత డబ్బు ఎక్కడి నుండి తేవాలి ... ఈ సంబంధానికి నీళ్ళు వదులుకోవాల్సిందే తప్ప, ఆశపడకూడదు. ఏదో అమ్మాయి రాత ఎలావుందో, అలా కానిద్దాం. మనకు తగిన సంబంధం చూసి ముడివేసేద్దాం. చాలా పొద్దుపోయింది. పడుకో" అంటూ నడుం వాల్చాడు ప్రక్కమీద. శారదమ్మ ఓ నిట్టూర్పు విడిచి కళ్ళు మూసుకు పడుకుంది.

"మాష్టారూ నేను వెళ్ళొస్తాను. చెల్లాయికి పెళ్ళి ప్రయత్నాలేమయినా చేస్తున్నారా ?" అడిగాడు సంచి భుజాన తగిలించుకుంటూ.

"ప్రయత్నిస్తున్నాము బాబూ! తగిన సంబంధం దొరకాలిగా" అన్నాడు ప్రకాశం పంతులు. అవును మరి తన స్థితికి తగిన సంబంధం దొరకాలిగా. ముఖంలో నీలి నీడలు అలుముకున్నాయి. వాటిని బలవంతంగా అదిమిపెట్టి "మీ అమ్మా నాన్నను అడిగానని చెప్పు బాబూ! వెళ్ళిన వెంటనే వుత్తరం వ్రాయి."

"అలాగే మాష్టారు. తప్పకుండా వ్రాస్తాను. అప్పుడప్పుడు ఉత్తరం వ్రాస్తుండండి. చెల్లాయి పెళ్ళికి తప్పకుండా పిలవండి మాష్టారు. వస్తానమ్మా, శాంతా వెళ్ళొస్తాను. ఈ సారి రావడం నీ పెళ్ళికే" అన్నాడు శేషగిరి.

# ఆపదలో ఆత్మీయుడు

"పో అన్నయ్యా" అంది పెగ్గు ముంచుకు రాగా.

"అలాగే పోతానమ్మా! మళీ నిన్ను పంప డానికే వస్తాను" అంటూ కదిలాడు ముందుకు. వెళుతున్న శేషగిరిని కనుచూపు మేర వరకూ చూశారు ముగ్గురూ.

పోస్ట్‌మేన్ ఇచ్చిన పేపర్‌లో సంతకం పెట్టి రిజిష్టర్ కవరు అందుకొని ఓపెన్ చేశాడు. ఉత్తరం మడత విప్పాడు అందులో చెక్కు డ్రాఫ్టు కనిపించింది. ఆశ్చర్యంతో చూశాడు. పదివేలకుంది. ఆశ్చర్యం ఇంకా ఎక్కువయ్యింది. ఉత్తరం చదవసాగాడు. ముగిశాక కళ్ళలో నీరు నిండుకొని అక్షరాలు అలుక్కుపోయినట్లనిపించాయి.

అప్పుడే అక్కడి కొచ్చిన శారదమ్మ "ఏమిటండీ కళ్ళల్లో కన్నీరు, ఎక్కడి నుండి ఉత్తరం. ఏం జరిగింది" అడిగింది ఆశ్చర్యంగా.

పంచకొంగుతో నీళ్ళు తుడుచుకొని "కన్నీళ్ళు కావు శారదా ఆనంద బాష్పాలు. కొడుకులు లేరని, అమ్మాయి పెళ్ళి చేయ గలమా అని బాధపడేవాళ్ళం. కాని ఆ కోరికను, బాధను పోగొట్టడానికి దేవుడు చిన్న పరీక్ష పెట్టాడు. ఈ ఉత్తరం చదువు నీకే తెలుస్తుంది" అని ఉత్తరం ఇచ్చాడు.

శారదమ్మ అందుకొని చదవసాగింది.

మహారాజరాజశ్రీ పూజ్యనీయులైన మాష్టారుగారికి, అమ్మగారికి, నమస్కారములతో వ్రాయునది. నేను క్షేమంగా వూరు చేరుకున్నాను ఇకపోతే చెక్కు మీరు చూసే వుంటారు. అందుకే ఈ ఉత్తరం మొత్తం చదివి ఓ అభిప్రాయానికి వస్తారని ఆశిస్తాను చెక్కు పంపడానికి కారణం వుంది. నేను ఆ రోజు రాత్రి క్రొత్త చోటు అయినందువలన నిద్ర పట్టక ప్రక్కమీద దొర్లుతుండగా మీరు మాట్లాడుకున్న మాటలు అప్రయత్నంగా నా చెవినబడ్డాయి. మీ బాధను అర్థంచేసుకున్నాను అప్పుడే నా సహాయాన్ని మీకు అందివ్వాలని అనుకున్నాను. కాని మీరు ఆత్మాభిమానం కలవారని తెలును నాకు. అందుకే వూరికి వచ్చి మాష్టారుగారి పేరున చెక్కు పంపాను. ఇక డబ్బు సంగతంటారా... దేవుడు మాకు కొంత ప్రసాదించి మరచిపోయాడు. ఆ డబ్బు కొంత విలువ వుంది. అది దేనికు వ్యర్థం కావాలి. నా ఈ స్థితికి కారకులైన మీకు సహాయపడడం నా కర్తవ్యంగా తలచి ఈ డబ్బు పంపుతున్నాను. ఈ విధంగా మీకు సహాయం చేయగలుగుతున్నందుకు నాకెంతో సంతోషంగా వుంది అమ్మానాన్నలకు చెప్పాను. వారుకూడా సంతోషంగా ఒప్పుకున్నారు.

మీకు కొడుకులు వుంటే ఆ బాధ్యత వారే వహించేవారు లేరు. మీరు నాకు తల్లి తండ్రి లాంటి వారు శాంత నా చెల్లెలు. అటువంటప్పుడు నేను చేసింది గొప్పని అనుకోను. అందుకే మీరు ఈ చెక్కును వాపసు పంపరని తలుస్తూ, శాంతకు నా దీవెనలు అందచేయండి పెళ్ళి శుభలేఖ పంపండి. ఇట్లు

మీ శిష్యుడు
శేషగిరి (చిట్టి)

"ఏమండీ! ఏం చేద్దామంటారు?" అడిగింది సందేహంగా.

"అదే ఆలోచించాను శారదా! ఈ పరిస్థితులలో డబ్బు అవసరం మన కెంతైనా వుంది డబ్బు సంపాదించలేను అమ్మాయి పెళ్ళి తగిన విధంగా చేయలేను డబ్బు తీసుకోడానికి అభిమానం అడ్డు వచ్చినా, ఆడపిల్లను కన్నందుకు అభిమానానికి పోతే అమ్మాయికి అన్యాయం చేసిన వాళ్ళం అవుతాము. అందుకే ఆత్మాభిమానాన్ని చంపుకోక తప్పదు ఇంతకంటే చేయగలిగింది లేదు పోస్టాఫీసుకెళ్ళి వస్తాను. సంబంధం ఖాయం చేయమని ఉత్తరం వ్రాస్తాను" అంటూ వీధిలోకివెళ్ళిపోయారు ప్రకాశం పంతులు మాష్టారు.

శాంత తలుపు ప్రక్కనే వుండి అంతా విని "తనకోసం అమ్మా నాన్న ఎంత బాధ పడుతున్నారు ఆడపిల్లగా ఎందుకుపుట్టాను, మగపిల్లవాడిగానైనా పుట్టి వుంటే కన్న వారికి చేతనయిన సహాయం చేసి వుండేదాన్ని. పెళ్ళి చేసుకుని ఒంటరివాళ్ళను చేసి తన సుఖం తాను వెదుక్కుంటూ వెళ్ళిపోతుంది తను. ఆడపిల్ల పుట్టినందుకు ఇంతకంటే ఇంకేం చేయగలను. "అన్నయ్యా" అని పిలిచినందుకు ఆ అనుబంధానికి శేషగిరి అన్నయ్య డబ్బు పంపి తల్లి తండ్రిని ఆదుకున్నాడు. రక్తసంబంధం లేకపోయినా ఎంత సాయం చేసాడు!?" అని మనసులోనే కృతజ్ఞతలు తెల్పుకొంది.

# ఫాలాక్షుని డైరీ



## వింత శిక్ష !

శాంత మోనికా అనే వో జాపనీస్ రెస్టారెంట్ సొంత దారు గంజాయి పెంచుతున్నట్టు కేసు మోపబడి నిరూపింప బడిందట ఈ కేసు విచారించిన జడ్జి అతనికి వో వింత శిక్ష వేశారట. మైనారిటీ తీరిన వారికి తొంభై రోజుల పాటు ఆ నిందితుని హోటలులో భోజనం సగం రేటుకే పెట్టాలనీ, భోజనం సగం రేటుకు 90 రోజులకు పెట్టబడును అని స్థానిక పత్రికలలో ప్రకటించాలనీ 'శిక్ష వేసి' దీనివల్ల ఆ ప్రాంతం వారు పుష్టిగా వో 90 రోజులు భోంచేస్తారు అన్నారట.

## మారుతాళంతో మానభంగం !

కాలిఫోర్నియాకు చెందిన వెంటురా అనే చోట అద్దె యిళ్ళ భవనంలోని వో పోర్షనులో అద్దెకుంటున్న ఒకామె లోపల తాళం వేసుకుని పడుకుంటే వో ఆగంతకుడు మారు తాళంతో తలుపు తీసి, ఆమెను చెరిచి చక్కాపోయాడట. ఈ భవనం కట్టాక లోపలి హంగులు చేయడానికిగానూ ప్రతి పోర్షను తెరవడానికి వో మాస్టరు తాళం చెవిని ఆ పని చేసే కంట్రాక్టరుకు భవనం సొంతదారు యిచ్చాడట. పనయ్యాక ఆ తాళం చెవి తిరిగి తీసుకోనందు వల్ల యీ సంభవం ఏర్పడిందని, ఆమె భవనం సొంతదారు మీద ఆ మాస్టరు తాళం చెవి చేసిన తాళాల కంపెనీమీదా రెండు లక్షల ముప్పయ్యైదు వేల పౌనులకు దావా వేసి గెలిచిందట.ఆహా. అయితే అయిందిగానీ, ఎంత డబ్బు'.

## ప్రపంచంలో పొడవైన వంతెన !

గంగానది మీద 46 కోట్ల ఖర్చుతో కట్టిన మహాత్మాగాంధి రోడ్డు బ్రిడ్జి ప్రపంచంలో కల్లా పొడవైనదట. ఈ బ్రిడ్జి 50575 కిలోమీటర్ల పొడవట. ఉత్తర బీహారు రాష్ట్రాన్నీ ఆ రాష్ట్ర రాజధానినీ యీ బ్రిడ్జి కలుపుతున్నదట. పవిత్ర గంగానది రెండుగా విడదీసిన యీ రాష్ట్రం యిప్పుడీ బ్రిడ్జితో కలుసుకున్నట్టయినదట. ఈ బ్రిడ్జి కట్టడానికి 1970 జూన్ 19వ తేదీన ఇందిరాగాంధి పునాదిరాయి వేశారట.మళ్ళీ ఆవిడే 1982 మార్చి 2వ తేదీన ప్రారంభోత్సవం చేశారట.

## అనర్థానికి దారి తీసిన అత్తపోరు !

కోయంబత్తూరుకు చెందిన వెలాండి పాలయంలో రాజామణి అనే అతని భార్య శాంతామణికి, ఆమె అత్తగారు కాలికుట్టి అమ్మాళ్‌కూ అనుక్షణమూ ఆరని అగ్నిహోత్రమేనట.ఈ దుర్భరమైన జీవితం గడప యిష్టంలేని శాంతామణి వో నాటి రగడలో తన పిల్లలు ఏడేళ్ళ కళ, ఐదేళ్ళ శంకరాజాను నూతిలో పారేసి, తానూ దూక బోయేసరికి అదిరిపోయిన అత్తగారు ఆమెను వారించ బోయిందట. శాంతామణిపెనుగులాటలో అత్తాకోడళ్ళిద్దరూ ఎగిరి నూతిలో పడ్డారట. దాంతో నలుగురూ చనిపోయారట.

## జపానులో స్త్రీలు !

జపానులో ఉద్యోగాలు చేసే స్త్రీల సంఖ్య ప్రతిసంవత్సరం పెరుగుతున్నది. ఇటీవల జపాను ప్రభుత్వపు కార్మిక మంత్రిత్వశాఖ వారు విడుదల చేసిన ఒక శ్వేత పత్రం ప్రకారం ప్రస్తుతం జపానులో 2,18,50,000 మంది స్త్రీ కార్మికులున్నారు. వీరి ఉద్యోగాలలో మార్పులు ఏర్పడుతున్నాయి. గత కొద్ది సంవత్సరాలలో స్త్రీలు సాంకేతిక రంగంలో నిపుణులుగా ప్రవేశించడం ఒక విశేషం. పురుష కార్మికుల పెరుగుదల 0.8 శాతం వుండగా, స్త్రీ కార్మికుల పెరుగుదల 12 శాతం వుండటం మరో విశేషం. మొత్తం కార్మికులలో స్త్రీలశాతం 38.7 శాతం వున్నది !

## జీవిత భీమా భవనం పై నుంచి దూకి ఆత్మహత్య !

ఢిల్లీలో 70 ఏళ్ళ గారి శంకర్ షూడ్ అనే ఆయన లైఫ్ ఇన్సూరెన్సు భవనం పదకొండో అంతస్థు మీంచి దూకి, ఆత్మహత్య చేసుకున్నారట. ఈయనఢిల్లీ క్లాత్ చిల్లర వ్యాపారుల సంఘానికి అధ్యక్షుడట. పైగా ఆ రోజులలో యీయన స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న వారట. తనకు జీవితం మీద విసుగు పుట్టిందనీ, మానసిక బాధలను తాను తట్టుకోలేక యీ పని చేయ నిశ్చయించుకున్నానని వో పుత్తరంలో వ్రాశారట.

## అమ్మాయి అఘాయిత్యం !

యు. యస్. ఎ. చికాగోకు చెందిన 18 ఏళ్ళ యువతి 22 ఏళ్ళ యువకునితో ప్రేమకలాపాలు సాగించి కడుపు తెచ్చుకుని, అదొచ్చిపడ్డ టైము తెలీక, తెలిసే సరికి తీయించుకునేటయిము దాటిపోయినట్టు తెలుసుకున్నదట. తన గర్భానికప్పుడే ఆరోనెల వచ్చేసిందని తెలుకుని, జీవితం మీద విరక్తి పుట్టి పిస్తలుతో పొత్తి కడుపులో పేల్చుకున్నదట. ఆస్పత్రిలో చేర్చిన ఆమెకు డాక్టర్లు సిజేరియన్ ఆపరేషను చేసి మృత శిశువును తీసేశారట. తల్లి బ్రతికిందట. అనుకున్న గర్భస్రావం జరిగినా అనుకున్నట్లు గుట్టుగా జరగలేదు. ప్రపంచ వార్తగా మారి మానం తీసిందా పని పాపం.!.

## మాలిష్ ముసుగులో వ్యభిచారం !

మేరిలాండ్ (యు. యస్. ఎ)లో "మస్మేజ్ పార్లర్స్" అధికమయ్యాయట. వొళ్ళు పట్టే ... మీద జవ్వనులు డబ్బుకల మగవారిని ఆకర్షించి వారి కామదాహాలను తీరుస్తున్నారట. వ్యభిచార గృహాలను ఆ దేశం ఆపాక, యీ పార్లర్లు కుక్కగొడుగులుగా పుట్టి ఆలోటు తీరుస్తున్నాయట. అందమైనఅమ్మాయిలు యీ పార్లర్స్‌లో వుంటారట. మాలిష్ చేసే పనుల కోసం ,వీరు వున్నా తెర వెనుక భాగోతం మరోటి జరుగుతోందని పోలీసులు ఘోరుమంటున్నారుట. వీరేల ఘోరుమననేల !!.

## ప్రాణం మీదికి తెచ్చిన కృత్రిమ అవయవం !

శాన్‌ఫ్రాన్సిస్కో పోలీసులు టెండర్లాయిన్ జిల్లాలోని వో సెలూన్‌మీద విరుచుకుపడి, అక్కడ దొరికిన మగవారినందర్నీ పట్టుకుని క్యూలో నిలబెట్టి, వారి వద్ద ఆయుధాలేమైనా వున్నాయా అని వెతుకుళ్ళాడుతూ వోహతని ప్యాంటులో కొంచెం ఎత్తుగా వున్న దాన్ని చూసి, అది పిస్తోలని తలచి భటాలున నొక్కి పట్టుకునేసరికావ్యక్తి "బాబోయ్ చంపేశావ్‌పో"అని కెవ్వునకేకేసి క్రింద పడ్డాడట. అతన్ని వెంటనే ఆసుపత్రిలో చేర్చారట. ఇంతకీ అతనికి మగతనం లేనందువల్ల కృత్రిమ పురుషాంగాన్ని వో19 సెంటీ మీటర్ల పొడవులో అమర్చారట. దాన్ని యీ పోలీసులు నొక్కేశారాట. అది కథ !




"నమస్తే సార్."

"ఆఁ ..."

"రెన్యువల్ కోసం వచ్చానండి."

"నీ ముఖం చూస్తేనే ఆ విషయం తెలుస్తోంది గానీ, ముందవతలకెళ్ళి నిలబడు" నిర్లక్ష్య ధోరణిలో అన్నాడు రెన్యువల్ గుమస్తా.

సుందరం కాస్త చిన్నబుచ్చుకుని బయట కొచ్చేశాడు. వచ్చి అక్కడే జాగా చూసుకుని కూర్చున్నాడు. తనొచ్చిన పనవుతుందో, లేదో! సందిగ్ధంలో పడి తలమున్కలై పోతున్నాడు.

రెన్యువల్ చేయించుకున్న వాళ్ళు పనై బయటకొచ్చేస్తూంటే, చేయించుకోవాలసిన వాళ్ళు లోపలికెళ్ళి, సుందరం లాగే చీదరింపబడి బయట కొచ్చేస్తున్నారు.

పావుగంట గడిచింది.

అందరికి పిలుపొచ్చింది రెన్యువల్ గుమస్తా నుంచి. అందరూ వెడుతున్నారు. సుందరం కూడా వెడదామని లేవబోయి, ఒంటరిగానే ఆయన్ని కలసుకోవాలని కూర్చుండి పోయాడు మళ్ళీ. గంటవరకూ అతని దగ్గర రష్ తగ్గలేదు. ఆ తర్వాత మెల్లిగా లేచి వెళ్ళాడు.

"నమస్తే సార్."

"ఆఁ...ఏమిటి ?"

అతని కళ్ళు చాలా క్రూరంగా కనిపించాయి సుందరంకి. అతని మాటల్లో మార్దవం లేదు.

"రెన్యువల్ కోసం వచ్చానండి."

"ఇందాకా చెప్పావుగా! గుర్తుంది, కార్డేది ?"

"ఇదిగోనండి."

రె. గుమాస్తా చూసాడు. చూసి కార్డు మీదకి విసరి, "అది స్పాయిలయి పోయింది, మళ్ళీ రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి." అన్నాడు.

సుందరం ఏదయితే తను వినకూడదను-కున్నాడో, అదే వినేసరికి చమట్లు పట్టేసినాయి. ముఖం విచారగ్రస్త మయింది.

"సార్..."

"ఏమిటయ్యా! చెప్పాముగా స్పాయిలయిందని."

"అదికాదు సర్."

"ఏదికాదు. ముందవతల కెళ్ళిపో."

సుందరం కదల్లేదు. రె. గుమస్తా తన

కని చూస్తుంటున్నాడు. గుమాస్తాని ఎలా అర్థించాలో సుందరం కర్థం కావడంలేదు. ఎలా చెప్తే ఆ ముఖంలో జాలి పుట్టుకొస్తుందో తెలియటంలేదు. జీవితంలో యిటువంటి సమస్య నెలా సాల్వ్ చేయాలో అర్థం కాని అనుభవం. భయంతో గుండె దడ దడ లాడిపోతోంది. మూడు సంవత్సరాల సీనియార్టి గంగలో కలిసిపోతుంది, ఈ కారు స్వాయిలయితే ఎంప్లాయిమెంట్ ఆఫీసులో సీనియార్టి వుంటే యివ్వాడు కాకపోయినా, ఎప్పటికైనా అవకాశం రాకపోతుందా! దానివల్ల ఉద్యోగం రాకపోతుందాన్న ఆశ.

రె. గుమస్తా తలెత్తి "ఇంకా యిక్కడేం ముకయ్యా? వెళ్ళవతలకి ఇక్కడెవరూ వుండకూడదు." అన్నాడు.

"మీరలాంటే ఎలా సార్. దయుంచి..."

అతను అదోలా నవ్వి "దయా! మీ మీద దయ తలచి పని చేస్తే, మా నెత్తిన పైను గుడ్తే" అన్నాడు.

"అంత మాట అనకండి సార్. ఎలాగైనా రెన్యువల్ చేయించండి సార్ మళ్ళీ క్రొత్తది చేయించాలంటే సీనియార్టి పోతుందండి" అన్న సుందరం మాటలు విన్నాడు రె. గుమస్తా ఒకసారి సుందరం వంక చూసి పుస్తకంలో తల దూర్చాడు తల అటూ, ఇటూ ఆడించాడు దగ్గు రాకపోయినా దగ్గాడు అవసరం లేకపోయినా జేబులోంచి రుమాలు తీసి ముఖం తుడుచుకున్నాడు

రె. గుమస్తా బుర్రలో రేటు నిర్ణయమవుతోంది.

నాలుక పీకడం గుర్తొచ్చి సిగరెట్టు అంటించాడు. గుండె నిండా దమ్ము లాగి ఫోర్సుగా పొగ వదిలి సానుభూతిగా నిట్టూర్చి, "లాభం లేదయ్యా!" అన్నాడు. బుర్రలో నిర్ణయమైన రేటుకి మొదటి బాణంగా.

సుందరం ఆ తీర్పు విని గిల గిలాడి పోయాడు, ముఖం నల్లగా మాడిపోయింది.

రె. గుమస్తా కళ్ళు సుందరం జేబును నిశితంగా పరిశీలించాయి. ప్చ్...ఎత్తుగా లేదు జేబు. అయినా పొరుగూరి మనిషి, ఉండకపోవు.

సుందరం అతని వైపే అర్ధింపుగా చూస్తున్నాడు.

"ఏమయ్యా!" అని ముందుకు వంగి మెల్లగా, "ఒక పాతిక రూపాయిలివ్వు నీ పని చూసేస్తాను" అన్నాడు.

సుందరం ఆ రేటు విని ఉలిక్కిపడ్డాడు. తన దగ్గరే పాతిక రూపాయలున్నాయి. ఇంటి కెళ్ళడానికో పది రూపాయలవసర మవుతాయి. పదిహేను కంటె ఎక్కువివ్వలేడు.

"ఏం ... మాట్లాడవ్ ?"

సుందరం ముఖం జాలిగా పెట్టి "క్షమించాలి. అంతిచ్చుకునే స్తోమతు నాకు లేదండి" అన్నాడు.

గుమస్తా వెంటనే "జాలిపడి ఊరికే చేస్తాలే, సంతోషమేనా!" అన్నాడు.

సుందరం ముఖం కళ కళ లాడింది.

"జన్మలో మీ ఋణం తీర్చుకోలేనండి" అన్నాడు ఆనందంగా.

ఆ ఆనందం చూసి గుమస్తా హేళనగా, "చాల్లే నీ ఆనందం. సహాయం చేస్తానంటె బెట్టు చేస్తున్నావు. ఆఖరి సారిగా చెబుతున్నాను. ఇరవై కంటే తక్కువకి చెయ్యలేను" అని కుర్చీలోంచి లేచాడు.

సుందరంకి నిజంగా చేయడేమోనని భయపడి పోయాడు ఇంటి కెళ్ళడం మాటెలావున్నా, ఈ పని కాస్త పూర్తయితే చాలనుకొని జేబులోంచి రెండు పదులు తీసిస్తూ "చేయించండి" అన్నాడు ఎంప్లాయమెంటు కార్డు అందించాడు.

రె. గుమస్తా లోపలికెళ్ళి పావుగంటలో తిరిగొచ్చి "రెన్యువల్ చేయించాను. వచ్చేసారయినా జాగ్రత్తగా రెన్యువల్ చేయించుకో" అంటూ కార్డిచ్చాడు.

సుందర్ బయటకొచ్చి ఒకతన్ని టైయిమడిగాడు.

నాలుగు గంటలయింది.

జేబులు తడుముకుని, డబ్బులు పైకితీసి లెఖ్ఖ చూసుకుంటె అయిదున్నరమాత్రమే వుంది. అంటే సగం దూరం నడవాలి. ఎవ్వరినైనా అడుగుదామంటే యెవ్వరూ తెలియని వూరు. నడక ప్రారంభించాడు. ఒక వైపు పనయినందుకు సంతోషంగా వున్నా, ఇంటికి సరిగా చేరగలనో, లేదోనన్న భయం.

సాయంకాలపు వాతావరణం. దుమ్మురేపుకుంటూ స్పీడుగా పోయే వాహనాలు. కేకలు, అరుపులు, ఒకటేమిటి చాలా హడావిడిగా వుంది మెయిన్‌రోడ్డు. దూరంగా ఎక్కడో రైలు కూత. రైలుమీద వెడదామంటే ఆ సౌకర్యం కూడా లేని వూరు. నడక తప్పదని ఎలాగో చచ్చీచెడి ఊరు చివరికి అయిదు గంటలకి చేరుకున్నాడు.

* * *

సుందరం నడుస్తున్నాడు

రెండు మైళ్ళు నడిచాడు.

అంతలో ఎదురుగా వెడుతున్నోయువకుడ్ని పిలిచి ఆపాడు సుందరం.

"హల్లో! మీరా! ఇందాక ఎంప్లాయ్‌మెంటాఫీసు కొచ్చారు కదూ!" అన్నాడతను.

"అది గుర్తుపట్టే మిమ్మల్ని పిలిచాను" అతనితో కలిశాడు సుందరం. ఇద్దరూ నడుస్తున్నారు.

"మీ దేవూరు?" అడిగాడు సుందర్.

అతను చెప్పాడు.

"మీ దగ్గర ప్రయాణానికి డబ్బుల్లేక నడిచి వెడుతున్నారు కదూ!" సుందరం అడిగాడు.

అతను ఆశ్చర్యపోతూ, "మీకెలాతెలుసు" అడిగాడు సుందరం నవ్వి, "నేనూ మీలాగే ఊడ్చిపెట్టుకుని నడుస్తున్నవాడిని కాబట్టి" అన్నాడు.

ఎందువల్లనో అతను ఒకక్షణం మౌనంగా వుండిపోయి, "మనకి వాళ్ళు సహాయం చేస్తున్నారు. సంతోషమే. కానీ మనల్ని పిండి పిప్పిచేసి, యిబ్బందులపాలు చేసేలా చేయడం మాత్రం చాలా ఘోరమండి" అన్నాడు.

ఇద్దరూ కబుర్లాడుకుంటూ నడుస్తున్నారు.

వాళ్ళ కబుర్లలో నిరుద్యోగం,రాజకీయం—పెరిగిపోతున్న ధరలు చోటుచేసుకొంటున్నాయి.

ఒక మైలు నడిచారు.

అప్పటికి ఆరు గంటలయింది.

మంచి జోరుగా కబుర్లు సాగిపోతున్న సమయంలో సుందరం హఠాత్తుగా ఆగిపోయాడు.

"ఏమిటాగిపోయారు?" అడిగాడతను.

"మీ పేరు..."

"ముత్యాలరావు."

"ఆఁ... చూడండి ముత్యాలరావుగారూ! రోడ్డువారగా పాన్ పోసుకుంటున్నతను కూడా ఎంప్లాయమెంటాఫీసు కొచ్చినట్టున్నాడు కదూ!" అని ఓ యువకుడ్ని చూపించాడు సుందరం.

ముత్యాలరావు అతన్ని పరీక్షగా చూసి "అవునండీ, ఇతనూ వచ్చేడు" అన్నాడు.

పాన్ వేసుకుని మామూలుగా రోడ్డు మీదకి వచ్చినతను విశ్వమ చూసి, "హలో! మీరా! ఏమిటి, మీ యిద్దరిదీ ఒకే వూరా? షికార్‌కి వెడుతున్నారా!" అడిగాడు గుక్క తిప్పుకోకుండా.

సుందరం కతనిని చూస్తే చాలా జాలి కలిగింది. బట్టలు నలిగిపోయాయి. అవికూడా సింథటిక్ బట్టలు కావు.

ముత్యాలరావంతా చెప్పి, "ముగ్గురం కలిశాము. ఈ రహదార్లో మనలాంటి వెందరు నిర్భాగ్యులను కలుసుకోబోతున్నామో! హాయిగా కబుర్లాడుకుందాం, నడవండి, వింటేస్తాం!" అన్నాడు.

ముగ్గురు నడక సాగిస్తున్నారు.

ముత్యాలరావు చెప్పే కబుర్లు వింటూ, తమ కష్టాన్ని తాత్కాలికంగా మరచిపోయి సుందరం, విశ్వంలు నడుస్తున్నారు.

అలా ఓ పావుగంట నడిచారు.

కొంత దూరం నడిచాక ఒక పల్లెటూరి సెంటర్లో గుంపుమ చూసి నడక వేగం పెంచారు. జనం చాలా విచారగ్రస్తులై వుండటం చూసి, మిత్రత్రయం ఆ గుంపుని చీల్చుకుని లోపలి దృశ్యం చూసి నిర్ఘాంతపోయారు. ఒకరిముఖా లొకరు చూసుకున్నారు.

"ఆయనే కదూ?"

"ఆయనే!"

"ఎలా జరిగింది?"

# బహాదూరపు బాటసారులు

అప్పుడొకాయనొచ్చి చెప్పాడు.

"ఈయన టింప్లాయమెంటాఫీసులో పని చేస్తున్నాడు. ఇక్కడకి దగ్గర్లోనే ఓ వూరుంది. రోజూ నువేగామీద వెళ్లొస్తూ వుంటాడు. రోజూ బాగానే వెళ్ళి వచ్చేవాడు. కానీ, ఈవేళ ఆఫీసు అయిం తర్వాత వస్తున్నాడు. ఇక్కడికొచ్చేసరికిపడిపోయాడు. హార్ట్ ఎటాక్ మనిషేమో! చాలా బాధపడి పోయి చివరికి చచ్చిపోయాడు."

అదివిన్న సుందరం సానుభూతితో రిమ్యువల్ గుమాస్తా వైపు చూసాడు. ముత్యాలరావు నోటమాట లేక మూన్పండి పోయాడు, విశ్వం పరిస్థితి కూడా అదే.

అయిదు నిముషాలు గడిచాయి. ఆరో నిమిషంలో ముత్యాలరావు తేరుకున్నాడు.

"మీ కెవ్వరికీ అభ్యంతరం లేకపోతే ఈయన్ని వారి గ్రామము తీసుకువెడతాము" అన్నాడు ముత్యాలరావు.

"అయ్యో! అంతకన్నానా బాబూ! తప్పక తీసుకు వెళ్ళండి" అన్నారు పెద్ద మనుషులు. ముత్యాలరావు పడివున్న మోటారు సైకిల్ స్టార్టు చేయబోయాడు కానీ, అది పాడయిపోయి స్టార్టు కాలేదు. ఆ ఊరి పెద్దమనుషులే రెండు రిక్షాలని పంపించారు, సాధారణంగా ఇటువంటి పరిస్థితుల్లో రిక్షాలు బళ్లు కట్టరు.

రిక్షా లొచ్చినాయి.

ఒక రిక్షాలో రె. గుమాస్తా శవం, ముత్యాలరావూ, రెండో రిక్షాలో మోటారు సైకిలు, మిత్రద్వయం.

రిక్షాలు బయలుదేరాయి.

అరగంటలో గమ్యస్థలం చేరుకున్నాయి. ఒక భార్య, తన భర్త మరణాన్ని అనుకోకుండా విని, ఆమె పడే వేదన తలచుకుంటుంటే ముత్యాలరావు కళ్ళు చెమర్చాయి. మెల్లిగా కబురు తెలిపింది. గొల్లుమని ఏడుపులు భార్య, పిల్లలు, తల్లి చెల్లెళ్ళు రిక్షా చుట్టూ ముట్టేశారు ముత్యాలరావు క్కూడా ఏడుపాగలేదు శవాన్ని క్రిందకి దించారు. విశ్వం, సుందరంలు సువేగాని దించారు.

అక్కడి వాతావరణం గుండెల్ని కోసేలా వుండటంతో, అది చూడలేక, కాస్త ముందు కొచ్చారు మిత్రత్రయం, రె. గుమాస్తా మరణాన్ని ఇంట్లోవాళ్ళకి చెప్పేసి

"పాపం, చాలా పెద్ద సంసార మండి, ఆ సంసారం కోసమే పరోక్షంగా మనతిట్లు తింటున్నారిలా టివారు. ఆ... చూడండి సుందరం గారూ! మీ దగ్గరెంతుంది?" అడిగాడు ముత్యాలరావు.

"అయిదున్నర"

"మీ దగ్గర" విశ్వాన్ని అడిగాడు.

"నాలుగు రూపాయలు"

"నా దగ్గర అయిదు రూపాయలున్నాయి. మొత్తం కలిపితే పద్నాలుగు రూపాయలు. రిక్షావాళ్ళు పదిహేను అడుగుతున్నారనుకోండి, మన దగ్గరున్న పద్నాలుగూ యిచ్చేద్దాం. ఈ విచార సమయంలో వాళ్ళని రిక్షా వాళ్ళకి డబ్బులేమడుగుతాము? మీ కిష్టమేనా!" అని చూసాడు వాళ్ళ వైపు ముత్యాలరావు.

వారిద్దరు కూడా సంతోషంగా డబ్బులిచ్చేశారు.

ముత్యాలరావు ఆ డబ్బు మొత్తం రిక్షా వాళ్ళకిచ్చివచ్చి, భగవంతుడు మనకి కాళ్ళిచ్చాడు. హాయిగా కబుర్లు చెప్పుకుంటూ నడుద్దాం అని ఓ క్షణం ఆగి, "జీవితంలో కాకతాళీయంగా జరిగే సంఘటనలు చాలా కాలం వరకూ మరచి పోలేము కదూ!" అన్న ముత్యాలరావు మాటలు వింటూ ముగ్గురూ అప్పుడప్పుడే చిక్కబడుతున్న చీకట్లో కలసిపోయారు బహాదూరపు బాటసారులు.





# వారఫలం

**23-4-1982 శుక్రవారం మొదలు 29-4-1982 గురువారం వరకు**

★**మేషం :** దేవాదాయ ధర్మాదాయ శాఖల్లో పనిచేసే వారికి, దేవస్థానం ఉద్యోగంలో ఉండేవారికీ, బ్యాంకు, పత్రికా ప్రకటనలో పనిచేసే వారికి అనుభవనీయమైన సంఘటనలుండగలవు. స్త్రీలకు: ఆదాయ లోపం లేకపోవటం, మిత్ర సహాయ సంపదలుండటం గమనించగలరు.

★**వృషభం:** మీకు ధనప్రాప్తి గలదనీ, వ్యాపారం విస్తారంగా జరుగగలదనీ, ఉన్నతోద్యోగులకు మేలు చేకూరే అవకాశాలు కలగటం, ఆరోగ్య లోపం లేకపోవటం గమనింపగల వారం. స్త్రీలకు: సుఖసంపదలకు, వయసులో ఉన్నవారికి లాభదాయకం కావటం జరిగే వారం.

★**మిధునం:** మీ తాలూకు వస్తువులు పోవటం, తాపత్రయం అధికంకావటం, ఆరోగ్య లోపం ఏర్పడటం. రోడ్డు ప్రమాదాన్నుండి తప్పించుకోవటం గమనింపనున్నారు. స్త్రీలకు : బంధు సహాయం, ధనప్రాప్తికి అవకాశం గలవారమే.

★**కర్కాటకం:** కళాసాహిత్యపరంగా కొందరకు, రాజకీయరంగంలో కొందరకు, క్రీడావనిలో కొందరకు నూతనావకాశాలు, ధనప్రాప్తికిఅనుకూలమైన విధానంలో మేలు జరగనున్నది. స్త్రీలకు : సుఖం, ఆదాయం, ఉద్యోగంలో అభివృద్ధి, ఆనందకరమైన వార్తలు వినటం సంభవం.

★**సింహం:** శక్తికొలది ప్రయత్నించండి, మీ ఆలోచనలు ఫలితానికి రాగలవు. శుభకార్యాలోచనలతోనే వారం గడిచిపోతుంది. స్త్రీలకు : ముఖ్య బంధు సమాగమం, ధనప్రాప్తి, ఆరోగ్యమందు అభివృద్ధికరమయిన మార్పులు రాగలవు.

★**కన్య:** ధనలోపం లేని దినాలే. చాలవరకు పాత బాకీలు వసూలయ్యే మార్గం ఉంటుంది. సాహిత్య పరంగా కొందరకు అనుకూలం కలదు. క్రీడారంగంలో కొందరకు, ఈ రాశి వారికి అంతర్జాతీయ ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు: ధనం, ధాన్యం, సంతాన లాభం కొందరి విషయంలో, ఉద్యోగాభివృద్ధి కొందరకు చెప్పదగిన వారం. ఆరోగ్య లోపం లేదు.

★**తుల:** రాశియందు స్థితుడైన గురుడు సర్వ శుభములు చేకూర్చగలవాడు గాడు. ఆదాయంలో లోపం ఏర్పడే పరిస్థితి, రాజకీయ వాదులకు బాగా లేకపోవటం గమనింపగలరు. స్త్రీలకు : ప్రత్యేకించి ఏ విధంగా మేలు చేకూర్పబడుతుందని చెప్పవీలులేదు.

★**వృశ్చికం:** ఆదాయమున్నది. నాల్గు విధాలా అవకాశాలు ఏర్పడనున్నవి. భావానుగుణ్యమైన ఫలం అందగలవారం. వ్యాపారం నూతనంగా చేపట్టగల అవకాశమున్నది. స్త్రీలకు: రాజకీయంగా అవకాశాలు, క్రీడారంగంలో కొందరకు అవకాశాలు లభించి లాభదాయకములు కాగలవు.

★**ధనుస్సు:** ఈ రాశివారు వ్యాపారంచేసేలాగైనా, వ్యవహారం ఏదయినా అపరిష్కృతంగా ఉన్నా నెరవేరగల మార్గమున్నది. లాభదాయకం, ఆనందదాయకం అని గ్రహించాలి. స్త్రీలకు: విద్యాభివృద్ధికి, ధనాదాయానికి అవకాశం గల వారం.

★**మకరం :** మీరు ప్రయాసపడి లాభం, అనుకూలం. సంపాదించదలచినవిషయాలకుఅంతరాయం కలుగుతుంది. కొందరకు వ్యాపారంలో లాభం, కొందరకు క్రయవిక్రయానందం, కొందరకు రాజకీయంగా లాభదాయకం. స్త్రీలకు: సర్వవిధాలా సర్వరంగాలలో మేలు గల వారం.

★**కుంభం:** నల్గురిలో పేరు ప్రతిష్ఠలుండగల సన్నివేశాలు ఏర్పడగలవు. ఏవో కొనుగోలు చేయగల ప్రయత్నాలు చేయగలరు. అంతర్జాతీయ ఖ్యాతి ఏర్పడగల సన్నివేశాలుండగలవు. స్త్రీలకు: నూతన వికాసం, కొందరకు ఉద్యోగ లాభం.

★**మీనం:** మాటల్లో ఎంతో జాగ్రత్త వహించాలి. మీకు సంబంధమయిన వ్యాపారంలో ఏవో మార్పులు చేయవలసి రావటం గమనింపదగిన అంశం. కొందరకు సభా పత్రికా గౌరవములు ఏర్పడగలవు. స్త్రీలకు : వయసులో ఉన్నవారికి శుభకార్య ప్రస్తావనలు, కొందరకు ఉద్యోగ ప్రయత్నాలు ఫలించడం గమనింపదగిన అంశాలు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



నయనాభిరామం

మనసును దోచే మృదువైన
నేతలలో ప్రియ టెరీన్* చీరలు.
చిత్ర - విచిత్ర లతా పుష్పముల
విన్యాసముతో కూడినవి. కనులకు
ఇంపైన రంగులలో. ప్రతి
ఒక్కరి అభిరుచికి
అనుగుణంగా.

*టెరీన్—వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్.

TA/DCM/C/11/TEL

షో రూమ్: కావేరి భవన్, బెంగళూరు-560 009.
దాజిబాన్ పేట్, హుబ్లి 580 020.
చిత్ర దుర్గా రోడ్, దావణగేరె 577 002.

ఫ్యాషన్ వస్త్రములు
ది దావణగేరె కాటన్ మిల్స్ లిమిటెడ్,
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగేరె-577 002




(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ - 8 :** ఢిల్లీ కాన్ఫరెన్స్‌కని వెళ్ళిన శివప్రసాద్ అక్కడికి వెళ్ళకుండానే తన ఫ్రెండ్ శరత్‌బాబుతో తిరిగొచ్చిన భర్తను చూసి ఆశ్చర్యపోతుంది సుజాత. తను కాన్ఫరెన్సుకు వెళ్ళి తిరిగొచ్చే వరకు శరత్ ఇక్కడే వుంటాడని చెప్తే ఏం చెప్పాలో తోచక ఆలోచన్లో పడిపోతుంది. ప్రసాద్ ఢిల్లీ వెళ్ళకపోవడానికి గల కారణమేమిటో చెప్పకపోవడంతో, ఏమేమో వూహించుకొంటుంటుంది. నిద్రపట్టక వెర్రి ఆలోచనలు చేస్తున్న సుజాతతో కాంపోజ్ టాబ్లెట్ మింగించి నిద్రపుచ్చుతాడు శరత్. ఇంట్లో జరిగిన కొన్ని సంఘటనలవల్ల న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్‌ను కూడా శరత్‌బాబే పేల్చి వేశాడన్న అనుమానంతో అతన్ని పోలీసులకి పట్టివ్వాలని నిర్ణయించుకొంటుంది. తను వేసుకున్న ప్లాన్ అడ్డం తిరగటంతో చేసేదిలేక తన స్నేహితురాలు సునీత రాకకోసం ఎదురు చూస్తుంటుంది. పరిచయాలయ్యాక సునీతను తన గదిలోకి తీసుకువెళ్తుంది సుజాత. శరత్‌బాబుపై సుజాత పెంచుకొన్న అనుమానాలు వఠి భ్రమలు మాత్రమేనని రేడియోలో వచ్చిన వార్తల ద్వారా తేలిపోతుంది. అయినా ఆమె అనుమానం మాత్రం అలాగే మిగిలిపోతుంది. శరత్‌బాబుకి 'మతి స్థిమితంలేదు' అని శివప్రసాద్ ద్వారా తెలుసుకొన్న సుజాత అతనిపై తన సానుభూతిని వ్యక్తం చేస్తుంది.

## 11

"ఎలా ఉన్నాడండీ ?"

"ఎబ్సల్యూట్లీ నార్మల్! చాలా బావున్నాడు. నువ్వు చేసిన ఆమ్లెట్ చాలా బాగుందట. నిన్ను తెగ పొగిడేశాడోయ్ !"

"నాకు చాలా సంతోషంగా ఉందండీ."

"నిన్ను మెచ్చుకున్నందుకేనా ?"

"ఛ ! అదికాదండీ ! ఆయన బాగున్నందుకు. ఇంత త్వరగా మామూలు మనిషి అవుతాడనుకోలేదండీ !" కొంచెం ఆగి —

"రాత్రి ఆయన ఉన్న స్థితి చూస్తే... పాపం ! అసలు ఆయన ఇలా కావడానికి కారణం ఏమిటో ? ఏదో చాలా పెద్ద కథే ఉందన్నారుగా ? ఇప్పుడు చెప్పండి."

డ్రెస్సింగ్ టేబుల్ ముందు తల చిక్కు తీసుకుంటూ, అద్దంలో భర్త ప్రతిబింబాన్ని చూస్తూ అడిగింది.

శివప్రసాదు చేతిలో ఉన్న పేపరు పక్కకు పెట్టి ప్రారంభించాడు —

"శరత్తూ, నేనూ చిన్ననాటి స్నేహితులం అని చెప్పానుగా ? వాడిదీ, మాదీ పక్క పక్క ఊళ్ళే. మా ఊళ్ళోనే స్కూలు ఉండేది. రెండు మైళ్ళు నడిచి మా ఊరు బడికి వచ్చేవాడు. ఐదో తరగతిలో ఇద్దరం ఒక బెంచీమీదే కూర్చునేవాళ్ళం. శరత్ చాలా తెలివైనవాడు. క్లాసులో ఫస్టు వచ్చేవాడు."

"ఒక్క నిముషం ఆగండి." మధ్యలో అందుకొని అన్నది సుజాత.

"మద్రాసు ఐ. ఐ. టీ. లో అణుశాస్త్ర విభాగం అసిస్టెంట్ ప్రొఫెసర్ అని చెప్పారు. ఇంత పిచ్చి ముదిరిన మనిషి ప్రొఫెసర్‌గా ఎలా ఉన్నాడండీ ?"

"ఒకప్పుడు ప్రొఫెసరే ! ఇప్పుడు కాదు. రెండేళ్ళయింది ఆ ఉద్యోగం మానేసి..."

"ఇతనే మానేశాడా లేక వాళ్ళు తీసేశారా ?" దువ్వెన జుట్టుమీద బరబర లాగుతూ అడిగింది.

"రెండూ జరిగాయనుకో ! ఒకోసారి ఊరు వదిలి వెళ్ళిపోయేవాడు. రెండు మూడు నెలలు కన్పించేవాడు కాదు. ఊళ్ళో ఉండికూడా వారాల తరబడి ఇన్‌స్టిట్యూట్‌కు వెళ్ళేవాడు కాదు."

"మరయితే ఇక్కడ కాన్ఫెరెన్సులో పాల్గొనడానికి వచ్చాడని చెప్పారుగా ?" జుట్టులో దువ్వెన ఇరుక్కుపోయింది

"శరత్ అలాగే అనుకుంటున్నాడు. అందుకే అలా చెప్పాను."

"అలా అనుకోవడం ఏమిటండీ?" ఎడంచేత్తో జుట్టు పట్టుకొని, కుడిచేత్తో దువ్వెన లాగింది తెగిన జుట్టు దువ్వెనలో ఇరుక్కుని ఉంది.

"శరత్ ఇంకా తను ప్రొఫెసర్‌ననే అనుకుంటున్నాడు. ఎప్పుడూ న్యూక్లియర్ సైన్సుకు సంబంధించిన పుస్తకాలు చదువుతూ ఉంటాడు. థీసిస్ అంటూ ఎప్పుడూ ఏదేదో రాస్తూనే ఉంటాడు. హైదరాబాద్ న్యూక్లియర్ ఇన్‌స్టిట్యూట్‌లో కాన్ఫరెన్సు ఉన్నట్టు పేపర్లో చదివి ఉంటాడు ఇంకేం ? వెంటనే బయలుదేరి వచ్చేశాడు. తను కాన్ఫెరెన్స్‌లో డెలిగేట్‌గా పాల్గొనడానికి వచ్చినట్టే భావిస్తున్నాడు."

"ఆ కాన్ఫరెన్సు పోస్టుపోన్ కాకపోతే అతను అక్కడికెళ్ళి ఉండేవాడేనా ?"

"చెప్పలేను. ఆ మూడ్ మారిపోవచ్చు. తను ఎందుకు వచ్చాడోకూడా మర్చిపోయి ఉండొచ్చును లేక వెళ్ళినా వెళ్ళొచ్చు. అదంతా ఆ సమయంలోని అతని మానసిక స్థితిమీద ఆధారపడి ఉంటుంది."

"అదిసరే ! మీరు ఢిల్లీ వెళ్ళడం ఎందుకు మానేశారూ ?" ఆమె చేతిలోని దువ్వెన జారి కింద పడింది.

సుజాత ఆ మాట అడుగుతూ భర్త కళ్ళల్లోకి సూటిగా చూసింది.

శివప్రసాదుకు నోరెండిపోయింది.

"ఆరు నెలలుగా మీరు అదేపనిగా కష్టపడ్డారు. కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నానన్నారు. అంతర్జాతీయంగా గుర్తింపు వస్తుందని చెప్పారు. హఠాత్తుగా ఎందుకు మానేశారు ?" ఆమె తీవ్రంగా చూస్తూ అడిగింది.

ఆ చూపులు చురకత్తుల్లా తన గుండెల్లోకి దూసుకుపోతున్నట్టు ప్రసాదుకు అన్పించింది.

"నా బాల్యమిత్రుడి కోసం - శరత్ కోసం..."

"అంతేనా ?" భర్త కళ్ళల్లోకి చూస్తూ తనలో తనే అనుకుంది.

"లేక మీ స్నేహితుడికున్న జబ్బులాంటిదే మీకూ ఉందా ? అందుకే మీ ఇద్దరూ అంత దగ్గర స్నేహితులు అయ్యారా ?" మెదడులో కదిలిన ఆలోచనలను అణచుకుంది.

ఆమె మనసు కళ్ళెం తెగిన బలసిన గుర్రంలా పరుగులు తీస్తోంది.

మనసులో మెదులుతున్న భావాలను అణచుకుంటూ మళ్ళీ భర్త కళ్ళల్లోకి చూసింది.

ప్రసాదు ఆమె చూపుల్ని ఎదుర్కోలేనట్టు మరోవైపుకు చూస్తున్నాడు.

"సుజాతా ! తలలో నొప్పిగా ఉంది రాత్రి సరిగా నిద్రలేదు కదూ ? అందుకే మరో కప్పు కాఫీ ఇస్తావా ?" అడిగాడు ప్రసాదు.

సుజాత చేతిలోని దువ్వెన డ్రెస్సింగ్ టేబుల్ మీద పడేసింది. జుట్టు వడిచి ముడివేసుకుంటూ బయటికి నడిచింది.

పాలగిన్నె పొయ్యిమీద పెట్టింది

పాలు కాగుతున్నాయి.

చూస్తూ నిల్చున్న ఆమె మస్తిష్కంలో తేనె తుట్టెను కదిలించినట్టు అయింది.

గత స్మృతులు తేనెటీగల్లా లేచాయి

## 12

"ఏమిటి నాన్నా ఇది ?" హిందూ పత్రిక మేట్రిమోనియల్ కాలం చూపిస్తూ బాధగా అడిగింది తండ్రిని సుజాత

పరబ్రహ్మరావు పైపంచె తీసి, పడక కుర్చీమీద వేస్తూ "అవునమ్మా! నేనే వేయించాను" అన్నాడు

"పత్రికల్లో ప్రకటనలు ఇచ్చి నాకు పెళ్లి చేస్తారా నాన్నా ?" నిట్టూరుస్తూ అన్నది సుజాత.

"ఇందులో తప్పేముందమ్మా ? ఈ రోజుల్లో ఎన్నో సంబంధాలు ఇలా కుదుర్చుకుంటున్నవే. చూడు ! ఆ పత్రికలోనే ఎన్ని ప్రకటనలున్నయ్యో ? బంధుత్వాలు సన్నగిల్లిపోయి రాకపోకలు కూడా లేని ఈ రోజుల్లో, మనకు తెలిసిన కుటుంబాల్లో సంబంధాలు కుదరాలంటే అయ్యేపని కాదు. ఇందులో బాధపడాల్సిందేమీలేదు."



"నేననేది అదికాదు నాన్నా !"

"మరేమిటి ?" అప్పట్టు చూశాడు తండ్రి.

"నా పెళ్లికి ఇప్పుడేం తొందరొచ్చింది ?"

"ప్రతి ఆడపిల్లా పెళ్లి అవగానే, అనే మాటే అది. నా బాధ్యత నేను నెరవేర్చాలి గదా ? తల్లిలేని బిడ్డవు. అయిన వాళ్ళంటూ — అసలే లేరు. మంచి సంబంధం చూసి నీ మెళ్లో ఆ మూడు ముళ్ళూ వేయిస్తే నా బాధ్యత తీరుతుంది. నాకు మనశ్శాంతి దొరుకుతుంది."

"మీ ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉంది."

"అందుకే కదమ్మా నా తొందర ?"

"మిమ్మల్ని ఒంటరిగా వదిలి ... "

"పిచ్చి తల్లీ! నా కోసం నీ జీవితాన్ని నిరర్థకం చేసుకుంటావా ? ఆడదిక్కు లేకుండా పెరిగావు. ఆడపిల్లలకు పుట్టింట్లో జరగాల్సిన ఎన్నో ఆచ్చట్లు — ముచ్చట్లకు దూరం అయ్యావు. మంచి సంబంధం చూసి నిన్ను ఓ అయ్య చేతుల్లో పెట్టడం నా విధి, నా కర్తవ్యం. నేను కళ్ళు మూసే లోపల నీ బాధ్యత మరొకరికి అప్పగిస్తేగాని నా మనసు కుదుటపడదు తల్లీ. నేను జీవితం ఆఖరు అధ్యాయంలోకి అడుగు పెట్టాను "

"నాన్నా !"

"ఎందుకమ్మా బాధపడ్తావ్ ? నేను చెప్పింది సత్యం. భయపడితే సత్యం, సత్యం కాకుండా పోతుందా ? ఇంకా ఆఖరు అధ్యాయంలోనే ఉన్నాను. ఆఖరు పేజీలోకి రాలేదు. వచ్చేలోపల నా విధిని నేను నిర్వహించాలి. నాకు అడ్డు చెప్పకమ్మా !"

పరబ్రహ్మరావు చొక్కా విప్పి కూతురికి అందించి స్నానాల గదిలోకి వెళ్ళాడు.

అతను ముప్ఫై మూడేళ్లు జిల్లా పరిషత్ సర్వీసులో పని చేసి రెండేళ్ల క్రితం రిటైర్ అయ్యాడు.

ప్రావిడెంట్ ఫండుకు సంబంధించిన కాగితాలు పైకీ కిందకూ తిరిగి తిరిగి, ఈ మధ్యనే శాంక్షన్ అయి వచ్చింది.







ఆ డబ్బు చేతికందగానే సుజాత పెళ్లి ప్రయత్నాలు మొదలుపెట్టాడు.

స్నానంచేసి వచ్చి భోజనానికి పీటమీద కూర్చున్నాడు. అన్నంపెట్టి సుజాత ఎదురుగా కూర్చుంది. ఆమె ముఖంలో దిగులు కొట్టొచ్చినట్టు తండ్రికి కనిపించింది.

"ఏమ్మా అలా ఉన్నావ్ ? నేను చేసిన పనికి ఇంకా బాధపడుతున్నావా ? ఇష్టం లేదా ?"

"అదికాదు నాన్నా! మిమ్మల్ని వదిలి నేను ఒంటరిగా ఉండలేను నాన్నా !"

"ఒంటరిగా ఎందుకుంటావమ్మా ? భర్తతో ఉంటావు. మరో వ్యక్తి అండలో ఆదే నీడలో ఉంటావు."

"ఒకవేళ నాకు పెళ్లయి నేను ఆయనతో వెళ్ళిపోతే ... నువ్వు కూడా మాతోనే ఉండొచ్చుగా నాన్నా !"

"పిచ్చితల్లీ ! అదెలా సాధ్యం అవుతుందమ్మా? ఏ భర్తా అందుకు ఒప్పుకోడు. ఒకవేళ ఒప్పుకున్నా మర్యాద కాదు అలా అల్లుడింట్లో తిష్ట వెయ్యడం. బతికినంతకాలం ఒకరికి పాఠాలు చెప్పాము. చివాట్లు పెట్టాము. ఆత్మాభిమానం గురించి పసివాళ్లకు నూరిపోశాను. అసహన దశలో అల్లుడిచేత పాఠాలు చెప్పించుకోమంటావా ? చివాట్లూ, చీత్కారాలూ భరించమంటావా ? అలా చెయ్యలేను తల్లీ. నా మనసు అందుకు అంగీకరించదు. ఆత్మగౌరవం ఉన్నవాడు ఎవడూ అల్లుడింట్లో ఉండటానికి అంగీకరించడమ్మా !"



Pond's
Dreamflower talc

"అయితే ఒంటరిగా, మీరు ఎలా ఉంటారు నాన్నా?" బెంగ బెంగగా అన్నది సుజాత

"ప్రపంచం చాలా విశాలమైంది తల్లీ! పెన్షన్ రాళ్లు వస్తున్నంత వరకూ నా భుక్తికి ఫర్వాలేదమ్మా మా మేనత్త కూతురు ఒకావిడ ఉందని చెప్పాను కదూ? ఆమెకు భర్త లేడు"

సుజాత తలెత్తి తండ్రి ముఖంలోకి చూసింది.

"ఆమెకు సంతానం పెద్దది. ఆర్థికంగా చితికి పోయిన కుటుంబం అక్కడికే వెళ్ళి ఉందామను కుంటున్నాను ఆమెకూ ఆర్థికంగా కొంత సహాయం చేసినట్లు అవుతుంది నాకూ ఆ పిల్లల మధ్య కాలక్షేపం అవుతుంది."

పరబ్రహ్మరావు పీటమీద నుంచి చెయ్యి కడుక్కోవడానికి లేచాడు.

"ఎడ్వర్టైజ్‌మెంటులో ఈ కండిషన్ కూడా పెడ్తేసరి! అందుకు ఇష్టమైనవాళ్ళే వస్తారు"

పరబ్రహ్మరావు కూతురి ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు

"అదేమిటి తల్లీ! కూతురితోపాటు మామ కూడా కాపరానికి వస్తాడని ప్రకటించమంటావా? అంటే వధువు, మెడకు ఓ గుదిబండ ఉన్నది దాన్ని కూడా భరించేవాళ్ళే సంప్రదింపులకు రావాలని ప్రకటించమంటావా? అది చూసి, ఆ ప్రకటన చేసిన వాడెవడో 'పిచ్చివాడు' అనుకుంటారు"

సుజాత మౌనంగా తల వంచుకొని – కాలి బొటనవేలితో నేల రాస్తూ నిలబడింది.

"సుజాతా! నీ మనసు నాకు తెలుసు తల్లీ! నన్ను వదిలి, నువ్వు ఉండలేనని భయపడుతున్నావు గదూ? ఇప్పుడు నీకు అలా అన్పించడం సహజమే కాని పెళ్లి అయ్యాక, నీకే ఇలాంటి ఆలోచనలన్నీ అసహజంగా అన్పిస్తాయి కన్నవారు కష్టాలు వచ్చినప్పుడే గుర్తుకొస్తారు భర్తతో సుఖంగా కాపరం చేసే ఏ ఆడపిల్లా కన్నవారిని తల్చుకుంటూ దిగులు పడదమ్మా! నీ అదృష్టం ఎలా ఉందో? నిన్ను ఎంత ప్రేమించే భర్త వస్తాడో? ఎంత సుఖపెట్టేవాడు వస్తాడో? అందుకే మేరేజెస్ ఆర్ మేడ్ ఇన్ ద హెవెన్" అన్నారు

పరబ్రహ్మరావు మంచానికి అడ్డంపడ్డాడు

భోజనం చెయ్యగానే ఓ కునుకు తీసే అలవా టుంది అతనికి

"వరుడు కావలెను" అనే ప్రకటన ఇచ్చి వారం రోజులు అయింది

పరబ్రహ్మరావు రోజూ పోస్టు జవాను కోసం ఎదురు చూసేవాడు

కాని రెస్పాన్సు లేదు

రెండో ఆదివారం పత్రికలో మళ్ళీ అదే ప్రకటన వేయించాడు.

రెండోసారి ప్రకటన పడిన మూడు నాలుగు రోజుల తర్వాత రోజూ ఒకటీ, రెండూ ఉత్తరాలు రాసాగాయి

రకరకాలవాళ్ళు రాస్తున్నారు.

దాదాపు అన్నీ రెండో పెళ్లి సంబంధాలే!

కొందరు పిల్లలు ఉన్నారని రాస్తే, మరి కొందరు తమ పిల్లలు మొదటి భార్య తాలూకు పుట్టింట్లోనే పెరుగుతున్నారని రాశారు కొందరు



# మనసు కథ

పెళ్లి అయ్యాక పిల్లల్ని అమ్మమ్మగారింటినుంచి తెచ్చుకోవాల్సి ఉంటుందని రాశారు

సీనియర్ గుమాస్తా నుంచి, గెజిటెడ్ ఆఫీసర్లదాకా తమ హోదా, జీతం, మొదలైన వివరాలతో రాస్తున్నారు ఆ వారం అంతా అదే రకం ఉత్తరాలు వచ్చాయి పరబ్రహ్మరావుకు తను చేసిన పొరపాటు అప్పుడు కాని అర్థం కాలేదు

మరో ప్రకటన ఇచ్చాడు అందులో రెండో పెళ్లివాళ్ళు అప్లై చెయ్యవద్దని ఖచ్చితంగా రాశాడు ఆ ప్రకటన వరసగా మూడు వారాలు వేయించాడు

ఈసారి అప్లై చేసినవాళ్ళలో గ్రాడ్యుయేట్సు నుంచి, పోస్టుగ్రాడ్యుయేట్సు వరకూ ఉన్నారు కాని అందులో తొంభయ్ శాతం నిరుద్యోగులు కొందరు తాము చేస్తున్న ఉద్యోగం ఏమిటో చెప్పకుండానే, నెలకు వెయ్యి నుంచి రెండు వేలదాకా ఆదాయం అంటూ రాశారు ఇద్దరు ముగ్గురు మాత్రం లోయర్ డివిజన్ గుమాస్తా అనో లేక అప్పర్ డివిజన్ గుమాస్తా అనో రాశారు

పరబ్రహ్మరావు ఆ ఉత్తరాలు చదువుతూ దిన దినం కృంగిపోసాగాడు

క్రమంగా ఉత్తరాలు రావడం కూడా తగ్గింది

మూడో నెల మొదటి వారంలో, ఆ వచ్చిన ఆఫర్స్‌లో గుడ్డిలో మెల్లగా భావించిన ఓ నాలుగు అడ్రసులు తీసుకొని బయలుదేరాడు నిరాశతో తిరిగివచ్చాడు

సుజాత గుమ్మంలోనే ఎదురైంది

"అమ్మా! ఎంత సర్దుకుపోదామన్నా ఒక్కడూ సరైనవాడు దొరకలేదు. వెధవలు – అన్నీ అతిశయోక్తులే రాశారు" అంటూ నిట్టూర్చాడు.

"ఎందుకు నాన్నా అంత బాధపడతారు? ఇప్పుడు మునిగిపోయిందేముంది?"

"అంతా వాడి దయ! ఎక్కడ రాసిపెట్టి ఉందో?" చేతులు పైకెత్తి నిస్సహాయంగా అన్నాడు తండ్రి.

రోజులు గడుస్తున్నాయి

పరబ్రహ్మరావు కూతురికి సంబంధాలు వెదుకుతూనే ఉన్నాడు

పత్రికల్లోని మేట్రిమోనియల్ కాలంలో "వధువు కావలెను" అన్న ప్రకటనలు చదువుతూనే ఉన్నాడు

సుజాతకు తెలియకుండా ఉత్తర ప్రత్యుత్తరాలు మొదలుపెట్టాడు

పరబ్రహ్మరావుకు ఒక రకంగా ఇదే హాయిగా ఉంది

రోజూ బోలెడన్ని ప్రకటనలు!

తను ఖర్చుపెట్టి ప్రకటనలు వేయించడం కంటే ఇదే సుఖంగా ఉంది.

తన కూతురికి తగిన సంబంధం అని అనిపించిన వాళ్ళకే రాస్తున్నాడు.

ఓ రోజు సంతోషంతో "సుజాతా! సుజాతా!" అంటూ కూతుర్ని పిల్చాడు

ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ ఎల్. వి రామయ్యగారి షష్ట్యబ్ది పూర్తి అభినందన సభ మదరాసులో యిటీవలే ఘనంగా జరిగింది ఫొటోలో శ్రీ ఎల్ వి రామయ్య, ఆంప్ర హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ చల్లా కొండయ్య, సభాధ్యక్షులైన మదరాసు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ టి రామప్రసాదరావుగార్లని చూడవచ్చు









"ఏమిటి నాన్నా !"

"ఈ ఉత్తరం చూడు తల్లీ !"

సుజాత ఉత్తరం అందుకొని చదివింది.

"పూజ్యులు శ్రీ పరబ్రహ్మరావుగారికి
నమస్కారాలు.

మీ జాబు అందినది. నాకు మీరు రాసిన వివరాలు నచ్చితే అమ్మాయిని చూడటానికి రావచ్చును అని రాశారు. మంగళవారం వస్తున్నాను.

మిగతా విషయాలు సమక్షంలో మాట్లాడుకో వచ్చును.

ఇట్లు
భవదీయుడు
వి. శివప్రసాదు."

ఉత్తరం ముగించి సుజాత తండ్రికి అందించింది.

"చూశావా తల్లీ ! కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు పెద్దలు. అలా కలిసి రావాలి. చాలా మంచి సంబంధం. ప్రాంప్ట్‌గా జవాబిచ్చాడు. దేవుడు మేలుచేసి అన్నీ సమకూడితే, ఆ భద్రాద్రి రాముడి సన్నిధిలోనే నీ పెళ్ళి జరిపించాలని ఉందమ్మా !"

"శ్రీరామచంద్రుడ్ని పెళ్ళాడిన సీత ఏం సుఖపడింది నాన్నా ?"

"అలా అనకు తల్లీ ! కష్టాలు అనుభవించింది కనకనే ఆ తల్లి, స్త్రీ జాతికే ఆరాధ్య దైవం అయిందమ్మా !"

"భార్యను అష్టకష్టాలకు గురి చేశాడు కనకనే ఆ రాముడు మగజాతి ఆరాధ్యదైవమయ్యాడు: ఆదర్శ పురుషుడు అయ్యాడు."

"కాదు. రామచంద్రుడు ఏక పత్నీవ్రతుడు. తండ్రి మాటను జవదాటనివాడు. అందుకే ఆదర్శ పురుషుడయ్యాడు."

"వంటయింది. భోజనానికి లేస్తారా ?" సుజాత సంభాషణ మారుస్తూ అన్నది.

తనలో తనే నవ్వుకున్నాడు పరబ్రహ్మరావు.

ఆ రెండురోజులూ పరబ్రహ్మానికి క్షణం ఒక

## మనసు కథ

యుగంగా గడిచింది. అతను వస్తానన్న మంగళవారం రానే వచ్చింది.

హడావిడిగా ఇంట్లోకి వచ్చాడు పరబ్రహ్మరావు

"అమ్మాయ్ సుజాతా ! ఇంకా అట్లాగే కూర్చున్నావేం తల్లీ ? అతడు వచ్చే వేళయింది. త్వరగా తయారవు" హడావిడిగా అన్నాడు.

"ఏమిటో నాన్నా ! నాకు ఏదో భయంగా ఉంది."

"అదేమిటి తల్లీ ! భయం ఎందుకూ ? అన్ని విధాలా మనకు నచ్చితే పెళ్ళి సంగతి ఆలోచిద్దాం !"

"ముక్కూ మొహం తెలియని మనిషి. పేపరు ప్రకటన చూసి సంబంధాలు కలుపుకోవడం ... "

"సుజాతా లేనిపోని అనుమానాలు పెట్టుకోకు. బంగారంలాంటి సంబంధం. ఆస్తిపరుడు. బాగా చదువుకున్నవాడు. శాస్త్రవేత్త. ఎన్నో కాలేజీలలో విజిటింగ్ లెక్చెరర. అడ్వర్‌టైజ్‌మెంటు చూశావు గదమ్మా ?"

"అదికాదు నాన్నా ! మీరు వరుసగా ఎన్నో ప్రకటనలు ఇచ్చారు. గత మూడు నెలలుగా చూస్తూనే ఉన్నాముగా ఎలాంటి వాళ్ళనుంచి సమాధానాలు వస్తున్నయ్యో ? కొందర్ని మీరు స్వయంగా వెళ్ళి కూడా చూసి వచ్చారు."

"ఆ సంగతి వేరమ్మా ! మనం వరుడు 'ఇలా ఉండాలి – అలా ఉండాలి' అని ప్రకటించాం. మనం కోరినట్టు దొరకకపోవచ్చును. ఇది వేరు కదా ? అతనే స్వయంగా వస్తున్నాడు."

సుజాత తండ్రి ముఖంలో ఆదుర్దాను గమనించింది.

అర్ధగంటలో ముస్తాబై తండ్రి ముందు నిల్చుంది.

కూతుర్ని చూస్తుంటే పరబ్రహ్మరావుకు బ్రహ్మానందం కలిగింది.

నా బిడ్డ అందమైంది !

సుగుణాలరాసి !

పరబ్రహ్మరావు చెవుల్లో మంగళ వాద్యాలు విన్పించాయి.

వీధి మలుపులో కారు హారన్...కొద్ది క్షణాల్లో ఇంటిముందు కారు ఆగింది.

కారు డోర్ తెరిచి వేసిన శబ్దం.

అతను కారు దిగి గడపలో అడుగుపెట్టాడు

(ఇంకా వుంది)

## ఇవాళ ఉదయం

నిన్న ఉదయమే ఇవాళా —
ఆకాశమంతా చిమ్మి ఆహ్లాదంగా ఉంది.
చిన్న పిల్లాడై
మనసు కాడని ఉదయంలో ముంచి ఊదుతూ
గాల్నిండా బుడగలు బుడగలై పరవశం గెంతుతుంది.
ఇవాళ ఇంత సౌందర్య పరంపర కురుస్తూ
ఎదురొచ్చి చెయ్యూపే ఉదయాన్ని చేరటాన్కి
కంటిపాప మించి
కపోతం వెనక కపోతం కపోతాలు లేచెళుతూ
చుట్టూ గిరికీలు కొడుతున్నాయి.
ప్రకృతిలోని హరిత అరుణిమలన్నీ ఉదయం —
నాలో నీలో అతనిలో ప్రాణమై కదలాడే
గాలీ నీరు అగ్నీ ఉదయం —
ఎవరైనా
ఎన్ని కాలాలైనా
ఎన్ని గ్రీష్మాలై ఎన్ని శరత్తులై
ఎన్ని శిశిరాలై ఎన్ని వసంతాలైనా
ఉదయానికి ఋణపడే ఉంటారు.
మామూలు ఉదయమే —
ఇవాళ అంత కాంతై విశాల విశ్వమంతై
చిరుదరహాసం చల్లితే
నా అణుఅణువూ చైతన్య పదఘట్టన చేస్తుంది.
ఈ
ఉదయానికి
నేనే ఋణపడి ఉన్నాను.

— నందివి సిధారెడ్డి




# ఆమె నిశ్శబ్ద సౌందర్యంలో ధ్వనిస్తుంది
# చంద్రిక లోని అందాల భాష

అందాలకు అందం — "చంద్రిక"

వేలపూల మకరందం — "చంద్రిక"

వెన్నెల మెలత్తని చర్మ సౌందర్యానికి — చంద్రిక
ఆయుర్వేద మూలికలసారం — చంద్రిక

**CHANDRIKA**
AYURVEDIC SOAP

Sole distributors for Andhra Pradesh
Chandrika Enterprises,
-2-39/A, A. C. Guards, HYDERABAD - 500 004.

etasa/ceh /82-1




'అబ్బాయీ! నువ్వు మనూరు వచ్చి వెళ్ళి చాలా రోజులయింది. నిన్ను చూడాలని నా మనసు ఆరాటపడుతూవుంది. మీ నాన్న సంగతి నీకు తెలుసుగా. ఆయన ఏ సంగతీ పట్టించుకోరు. ఈమధ్యన ఆయన ఆరోగ్యమూ అంతంత మాత్రంగానే వుంది. నీవు వీలు చూసుకుని ఒకసారి వచ్చి వెళ్ళగలవు. వీలయితే పిల్లడినీ, కోడలినీ కూడా తీసుకుని రాగలవు నీ రాకకోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తూ - ఇక వుంటాను–నీ ప్రియమయిన అమ్మ.'

జేబులోంచి తీసి - ఆ వుత్తరాన్ని చేత్తో పట్టుకుని వాలుకుర్చీలో వాలిపోయాడు సుబ్బారావు. అది నిన్న వచ్చింది, తన వూరినుంచి. అతని మనసు పరిపరివిధాలపోయింది! ఆ వుత్తరం అందుకున్నప్పటి నుంచీ అదోకలాగుంది సుబ్బారావుకి. ... లేసి ఆకాశంలో చందమామ పసుప్పచ్చగా వెలుగుతూ వెన్నెలవాన కురిపిస్తున్నాడు ఆ పాలవెన్నెల్లో తడుస్తూ, చిరుగాలికి సన్నగా వూగుతూ, అందంగా కన్పిస్తున్నాయి కొబ్బరాకులు

సుబ్బారావుది ప్రేమ వివాహం. లలితని ప్రేమించి, పెళ్ళి చేసుకుంటానని అతనంటే అది కాదన్నాడు అతని తండ్రి రాతయ్య ఏమయినాసరే ఆ పెళ్ళి అయితీరాలని సుబ్బారావు గట్టిగా అనగా

గొడవయింది. ఇంట్లో నుంచి బయటికి వడవమని రంకెలు వేశాడు తాతయ్య.

అప్పటికే కాలేజీ లెక్చరరుగా వుద్యోగం చేస్తున్న సుబ్బారావు అందుకు సిద్ధమయ్యాడు.

'కొడుకు కొడుకు అని భుజాన వేసుకుని వూరేగావు! ఇప్పుడు చూడు. వాడు వాకే ఎదురు తిరిగేటంతటివాడయ్యాడు!' అంటూ కోపంతో రంకెలు వేస్తున్న తాతయ్యని కాస్త ఆగమని హెచ్చరించింది భాగ్యమ్మ. అలవాటు ప్రకారం ఆగాడు తాతయ్య, తప్పని పరిస్థితి.

కొడుకుమీద ఎనలేని వాత్సల్యం భాగ్యమ్మకి. దానికి అవధులులేవు. తాతయ్యకీ ప్రేమవుంది. కాని రెంటికీ తేడావుంది. ఆ కారణం వల్లనే—'నా మాట వినిపించుకోవు. నన్ను పట్టించుకోవు. నీకు నీ కొడుకే సర్వస్వమూలాగుందే!' అన్న భర్త ఎత్తిపొడుపు మాటలు భరించింది, భాగ్యమ్మ.

అసలు సుబ్బారావుని వ్యవసాయంలో పెడతానన్నాడు తాతయ్య. 'కన్నతల్లి వంటిది భూదేవి. ఈ భూమిని నమ్ముకున్న వాడెనడూ చెడిపోడు. ఈ రోజుల్లో భూమిని దప్ప మరిదేన్నీ నమ్మటానికి వీల్లేదు' – అని, సుబ్బారావుకి చిన్నప్పుడు తన వుద్దేశాన్ని చెప్పాడు తాతయ్య.

'అదేం వద్దు. అబ్బాయి బాగా చదువుకోవాలి. మంచి వుద్యోగం చెయ్యాలి' అంటూ పట్టుబట్టింది భాగ్యమ్మ. మునసబుగారి కొడుక్కి తాసీల్దారుద్యోగం వచ్చి ఆ గొప్పలు చెవిని బడ్డాక ఆమె దృష్టి కొడుకు చదువులమీదే లగ్నమయివుంది. ఏం చేస్తావురా అని అంటే, సుబ్బారావు చదువుకుంటానన్నాడు; తల్లి మాటకి వత్తాసుగా నిలిచాడు.

'మీ అమ్మా కొడుకుల్ది ఒకటే మాట. చూస్తున్నానుగదా! సుబ్బిగాడు పుట్టుకొచ్చాక నీకు అసలు నా మాటమీద లక్ష్యమే లేకుండాపోయింది' అని ఎగిరాడు తాతయ్య.

'మీకు మొదట్నుంచీ వాడంటే పగ! కన్న కొడుకనయినాలేకుండా. ఎవరూ కూడా అంత స్పర్ధ చూపించకూడదు!' అంది భాగ్యమ్మ.

'నాకా? నాకు వాడంటే పగ ఎందుకే?!' అని అడిగిన తాతయ్యని దులిపేసింది ఆమె.

'ఎందుకో నాకేం తెలుసు? వాడు పుట్టాక ఒక్కసారయినా భుజాన వేసుకున్నారా? ఏనాడన్నా వాడ్ని ప్రేమగా దగ్గరకు పిలిచి మంచీ చెడూ అడిగారా? అసలు ఎందుకూ మీకు వాడంటే అంత చెడ్డ కోపమూ?' అని కన్నీరు పెట్టుకుంది భాగ్యమ్మ. తీవ్రమయిన ఆ ఆరోపణకి – వడుం విరిగినట్టు అయి – తాతయ్య జావగారిపోయాడు; కృంగిపోయాడు. ఒక విచిత్రమయిన అవస్థకి గురి అయ్యాడు. 'వాడిమీద నాకు కోపం ఏమీలేదు' అని సంజాయిషీ చెప్పుకున్నాడు.

'ఎందుకు లేదూ?! వాడు కనపడితేచాలు ముఖం మాడ్చుకుంటారు. దగ్గరికి చేరి, వాడు ఎప్పుడయినా కబుర్లు చెప్పబోతే విసిరి కొడతారు. చూసేవాళ్ళు ఏమనుకుంటారు? ఏం మనుషులూ మీరు?'

'వాడిమీద నాకు ఏం కోపంలేదే అంటే వినిపించుకోవేం?!' అని గిలగిల్లాడతాడు తాతయ్య. కాని భాగ్యమ్మ ధోరణి భాగ్యమ్మదే.

సుబ్బారావు కాలేజీ చదువులకు వచ్చాక తాతయ్యకి ఇబ్బంది వచ్చింది. ఆ వూళ్ళో కాలేజీ లేనందువల్ల కొడుకున్వేసుకుని బస్తీలో కాపురం పెట్టి చదువులు చెప్పిచ్చుకుంటానంది భాగ్యమ్మ. 'బస్తీలో కాపురం పెడితే ఎట్లాగే? ఈ యవసాయం ఏమవుద్ది?' అని తాతయ్య అడ్డంపడ్డాడు. అది సాగేట్టు కనపడకపోగా —

'పోనీ బుడ్డాడ్ని హాస్టల్లో పెట్టగూడదా?' అని ప్రక్కదార్లు చూపించబోయాడు. 'పెట్టకూడదు. ఆ తిళ్ళు అబ్బాయి వంటికి పడవు. ఆరోగ్యం పాడవుద్ది. నా కొడుక్కి నేనే వండిపెట్టుకోవాలి.' అని పట్టుబట్టింది భాగ్యమ్మ.

'మరి నేనెట్టాగే?' అని తన సమస్యని బయట పెట్టాడు.

'మీరూ రాండి' అంది భాగ్యమ్మ.

'నేనా? ఛస్తే రాను. భూమి తల్లిని వదులుకుని అట్టా ఎక్కడికిబడితే అక్కడికి నేను రాను. ఏముందక్కడా?' అని అడిగాడు తాతయ్య.

'అట్లా అయితే మీరు ఇక్కడే వుండి ఆ పన్లు చూసుకోండి' అని తన నిర్ణయం చెప్పేసింది భాగ్యమ్మ. పెళ్ళయాక, అన్నదమ్ముల్తో తగాదా పడి వేర్లు పడ్డాక, భాగ్యమ్మని చూడకుండా ఏ ఒక్క రోజూ వుండలేదు తాతయ్య. ఆ మాటే నోటిదాకా వచ్చింది ఒతనికి. కాని, వయసు అడ్డుపడి, ఆ మాటను నోటి బయటికి రాలేదు. ఆ అనుబంధం సముద్రపు కెరటాల్లాగా వుబికి రాబోతే వాటికి బలవంతాన అడ్డు కట్టవేసాడు తాతయ్య.

రెండు సంవత్సరాలు గుడివాడలోనూ, ఆ తర్వాత నాలుగు సంవత్సరాలు వైజాగులోనూ కాపురం పెట్టి కొడుకుని చదివించుకుంది భాగ్యమ్మ. సెలవులకి అమ్మా కొడుకులు వచ్చేవాళ్ళు, ఆ నాలుగు రోజులూ తాతయ్యకి పండగలాగా అనిపించేది.

'కమ్మగా మసాలా వాసన వస్తూంది. మాంసం తెప్పించావా?' పొలంనుంచి ఇంటికి వచ్చిన తాతయ్యకి నోరూరి అడిగేవాడు కడుపులో ఆకలి కరా కరా అనగా.

'ఆ మాట నిజమేగాని అది అబ్బాయికేలెండి' అనేది భాగ్యమ్మ.

'అబ్బాయికేగాని మనకి లేదా? ఏంటే?'

'ఉహూ. అందరం మసాలాల్తో మాంసాలు వండుకుని దినాలంటే కొంప గుండమయిపోద్ది. మనదేంటి? పచ్చడీ పెరుగూ మనకి అలవాటే గందా! చదువుకుంటున్న కుర్రాడు వాడికి కావాలి గానీ'

'ఓసి పిచ్చిమొకమా! మనయ్యి పాచినోళ్ళా, ఆడిది మంచి నోరూనేంటే?'

'అబ్బబ్బ! అట్టా మాట్లాడకండి. అబ్బాయి వింటే ఏమనుకుంటాడు?! కొడుకు అని – ఒక ఇది లేదుగాని వంతుకి వస్తారు! అది మొదట్నుంచీ వున్న అలవాటే గందా!'

తాతయ్య నోరు మూస్తాడు. లోలోపలే ఆ బాధని దిగమింగుకుంటాడు. తన మాటని వినిపించుకోదే! మట్టి పిసికి బంగారం పండించిన చేతికి పచ్చడి మెతుకులూ, పుస్తకాలు బుచ్చుకుని షోగ్గా తిరిగే బుడ్డాడికి నవకాయ పిండి వంటలా? పక్షపాతం ఎందుకూ?

'అడికి పెడతానంటే కాదన్నది ఎవరూ? ఈ పక్షపాతమేంటూ అనేగందా నా ప్రశ్న!' అని మొత్తుకునేవాడు తాతయ్య, భాగ్యమ్మని లోలోపలే తిట్టుకుంటూ.

'పక్షపాతం లేదూ పాడూ లేదు. వూరుకోండి. మీకు బెట్టకుండా నేనేమన్నా దింటున్నానుకుంటున్నారా? ఆ బుద్ధి మా ఇంటా వంటా లేదు. మా వంశంలో భర్తంటే దైవమే.'

'అది నిజమేలేవే! మనంగూడా అట్లాగే ఎందుకు దినివావగూడదంటాన్నేను.'

'చెప్పాగా అందరూ అట్టాగే దింటే కొంప కొల్లేరవుద్దని. ఇక చాలుగాని వూరుకోండి. అబ్బాయి వింటే బాగుండదు' అంటుంది భాగ్యమ్మ.

నోర్మూసుకుని చుట్ట వెలిగిస్తాడు తాతయ్య వెలిగించి, వేపచెట్టు క్రింద మంచం వాల్చుకు పడుకుని తత్వాలు పాడుకుంటాడు. ఆ తత్వాల్లో కలిసిపోతుందతని బాధ.

ఆ ఘర్షణలు సుబ్బారావు చెవినోనూ పడేవి. కాని ఎప్పుడూ ఆ ఇద్దరి మాటల మధ్యకి వెళ్ళేవాడు కాదు. పట్టించుకోకుండా తన దార్ని తను పోయేవాడు సుబ్బారావు.

అమ్మకి తనంటే ఎంత ప్రాణాలు. తనకి జ్వరం వస్తే కళ్ళల్లో వత్తులు వేసుకుని దగ్గరే కూర్చునేది. తను ఏడిస్తే ఆమె గిలగిలలాడేది తను నవ్వితే నిండు గోదావరిలాగా తనూ నవ్వేది. తను కోపిస్తే ఆమె విలవిలలాడేది. లోలోపలే ఎంతగానో బాధ పడేది. కుమిలిపోయేది. తను కావాలంటే కొండమీది కోతినన్నా తీసుకునివచ్చి అందివ్వటానికి సిద్ధమయేది అమ్మ అమృతమూర్తి. ఆమె ఋణం ఏం చేసినా తీర్చుకోగలిగింది కాదు. నాన్నే వట్టి తిక్కల సుబ్బయ్య. ఎప్పుడూ తనతో మాట్లాడేవాడు కాదు గంభీరంగా నన్ను ముట్టుకోకు నా మాలకాకి అన్నట్టు వుండేవాడు. ఆయన పద్ధతే అర్థమయేదిగాదు. ఆ మనసులో ఏముందో తెలియదు. పైకి మాత్రం అదొక గండ్రాతి శిల్పం – అనుకునేవాడు సుబ్బారావు.

వీధిలో స్కూటర్ శబ్దం వినిపించింది.

తన ఆలోచనలనుంచి బయటపడి లలిత వచ్చిందేమోనని ఆశగా చూసాడు సుబ్బారావు.

ఆ ఇంటి దగ్గర ఆగకుండా వెళ్ళిపోయింది ఆ స్కూటరు, బరబరమంటూ. ఇంటి ముందరి కొబ్బరిచెట్టు మొవ్వులో కాకి గూడు పెట్టింది. 'కా. కా.' అని అరుస్తూవుంది తల్లికాకి. చలి ఎక్కువయింది కీ. కీ అని కాకిపిల్లల గోల. దూరంగా రైలు వెళ్తున్న చప్పుడు. ఇటువంటప్పుడు తల్లి దగ్గర వుంటే 'బాబూ. చలిగా వుంది. ఇది కప్పుకో.' అని తెచ్చిచ్చేది అమ్మ.

పెళ్ళయాక లలితతో కాపురం పెట్టాడు సుబ్బారావు. మూడు సంవత్సరాలపాటు ఆమెతో స్వర్గం అనుభవించాడు. ఆ మూడేళ్ళూ ఇద్దరూ ఒకరికొకరుగా బ్రతికారు. లలితది కూడా అమ్మ లాంటి మనసే. బాబిగాడు కడుపులో పడ్డాడు, లలితకి.

అప్పట్నుంచే వాడికోసం స్వెటర్లూ,

మేజోళ్ళూ అల్లటంలో మునిగిపోయింది లలిత. వాడికోసమని బలమయిన ఆహారం తీసుకుని ఎక్సర్సయిజులు చేసేది. ఆ బద్ధకం ఎగిరిపోయింది. పుట్టబోయే బిడ్డ గురించిన ఆరాటంలో భర్త అవసరాల్ని విస్మరించటం మొదలెట్టింది. బలహీనంగా వుంది. పాపం. ఓపిక లేదేమోలే అని సరిపెట్టుకున్నాడు, సుబ్బారావు. అయిదో నెలలో పుట్టింటికి వెళ్ళింది లలిత. ఒంటరి అయిపోయాడు సుబ్బారావు.

తను ఎంతో ఆదుర్దాగా వారానికి ఒక వుత్తరం రాసేవాడు లలితకి.

అయిదుత్తరాలకి ఒక బదులు వుత్తరం వచ్చేది. దాన్నిండా పుట్టబోయే బిడ్డ తన కడుపులో చేస్తున్నా అల్లరిపనుల గురించిన కబుర్లే. బాబిగాడు బయటపడ్డాడు. సుబ్బారావు వెళ్ళి చూసివచ్చాడు. లలిత హృదయంలో తన స్థానం ఒక మెట్టు దిగిందని అర్థమయేక గిలగిలలాడాడు సుబ్బారావు. బుస్సున కోపం పొంగివచ్చింది. తల్లి ప్రక్కలో అమాయికంగా పడుకునివుండిన ఆ బుడ్డాడ్ని తన్నాలన్నంత కోపం వచ్చింది. వాత్సల్యం ఆ కోపాన్ని జయించగా ఆ పరిస్థితికి రాజీపడ్డాడు సుబ్బారావు.

డెలివరీ అయ్యాక పుట్టింట్లో అయిదు నెలలుంది లలిత. కసిగా కొరుక్కుతింటూ ఒంటరితనం. ఆ ఒంటరితనాన్ని జయించటానికి లలితకి వుత్తరాలు రాసేవాడు. లలిత నుంచి జవాబులు వచ్చేవి. కాని లలిత వుత్తరాల్నిండా బాబిగాడి కబుర్లే! గుండె మూలల్లో దుగ్ధగా అనిపించేది. ఆ భావం అసలు తనకే బాగాలేదనిపించి దానిని అణచివేయటానికి ప్రయత్నించేవాడు. విచిత్రమైన అవస్థ.

లలిత వచ్చింది. చంకలో బాబిగాడు! వెధవ నవ్వులూ వాడూ.

తమ ఇద్దరిమధ్యా రాత్రుళ్ళు మంచంమీద బాబిగాడు! పానకంలో పుడకలాగా – వాడు లేచి అర్ధరాత్రి గొడవ చేసేవాడు. నిద్రలు పాడయేవి. ఇంతకుముందు తనలో ఎక్కడా లేని ఓపిక తెచ్చుకుని వాడితో తంటాలుపడేది లలిత. సరదాగా ఇద్దరూ కలిసి చూడాలనుకున్న సినిమాలు దూరంగా పోయేయి. షికార్లూ ముచ్చట్లూ మూలనపడ్డాయి.

# అన్వేషణ

జీవితం ఒక కొత్త మలుపు తిరిగినట్లు అనిపించింది. ఇంట్లో ప్రాముఖ్యత అంతా బాబిగాడి చుట్టూనే కేంద్రీకరించబడింది. అప్పుడప్పుడూ సుబ్బారావు గుండెల్లో స్పర్థ తల ఎత్తేది. దాన్ని లోలోపలే పాతిపెట్టేవాడు. పరిస్థితులతో రాజీపడటానికి ప్రయత్నించేవాడు.

తప్పటడుగులు వేసి గుమ్మటంలాగ తయారయిన బాబిగాడు తన చిట్టి పొట్టి కబుర్లతో తల్లిని పరవశురాల్ని చేసి, ఆమెని దోచుకుని, ఎదిగి వచ్చి స్కూల్లో చేరాడు. లలిత తన సర్వస్వమూ బాబిగాడేనన్నట్లు ప్రవర్తించేది!

బాబిగాడూ, వాడి స్కూలూ, పుస్తకాలూ, ఏర్పాట్లూ – వీటితో తల మునకలయిన లలితకి క్షణం తీరిక వుండేదిగాదు. అందువలన తన పనులు తనే చేసుకోవటం అలవాటయింది సుబ్బారావుకి. సుబ్బారావు చాలా అన్యాయంగా విస్మరించబడుతున్నాడు. తన భర్త ఎడల భార్యకి నిర్లిప్తత ఏర్పడటానికి ఒక కారణం పిల్లలు. ఆ పిల్లలు ఆ భార్యాభర్తల అనురాగలత పూసిన పువ్వులూ, దాంపత్య జీవితం – సంసార వృక్షానికి అందించిన అమృత ఫలాలూ. వాటిని ఆ భర్తే ద్వేషించటం అన్నది ఒక విచిత్రం. అసహజం. కాని స్వార్థం తల ఎత్తిన మనిషిలో స్పర్ధ పెంపొందక తప్పదు. ఆ స్పర్ధని అణచి పెట్టుకొవటం తప్ప ఒక తండ్రి ఏమీచేయలేడు! బాధపడటం తప్పదు. అదీ బయటికి చెప్పుకునేదీగాదు.

'ఏమండీ! బాబిగాడి జుట్టు చూసారా?!'

'అవును. చక్కని జుట్టు వాడిది.'

'మీ జుట్టుకంటే కూడా చాలా బావుందండీ బాబిగాడి జుట్టూ.' తన జీవితాన్ని కట్టుకున్న ఆడది ఆ మాట అంటేనే ఎలాంటి మగాడికయినా పొడుచుకునేది.

'ఏమండీ. బాబిగాడి మొహం కళగల మొహమండీ. వాడు పెద్దయ్యాకా హీరోలా చాలా అందంగా తయారవుతాడు. అందరి కళ్ళూ వాడిమీదే వుంటాయి.'

'అవును. మంచి పర్సనాలిటీ మనవాడిది.'

'వాడికి మన పోలికలు రాకపోవటం అదృష్టంగదండీ?' ఇక్కడ మన అంటే సుబ్బారావు అన్నమాట. ఇక్కడే భర్తని దారుణంగా హింసిస్తున్నానని భార్య అనుకోదు. కాని అనాలోచితంగానే ఆ పని చేసి పారేస్తుంది. అతని గుండెలు మూలుగుతాయి మూయమూలల్లో.

'ఏమండీ. బాబిగాడికి మంచి మార్కులు వస్తున్నాయండీ. వాడు ఏం.ఏ. అయ్యాక ఐయ్యేయస్ చదివి కలక్టరునవుతానంటున్నాడు.'

'అలాగే. మనవాడ్ని కలక్టరు చేద్దాం.'

'కలక్టరుకాక కాలేజీ లెక్చరరు వుద్యోగం వాడెందుకు చేస్తాడండీ?' లెక్చరర్ అయిన భర్త గుండె ఆటువంటి మాటలవలన అంతరాంతరాలలో కన్నీరు కారుస్తూ ఏడుస్తూ వుంటుందని ఏ భార్యా గ్రహించదు. స్త్రీయొక్క పుత్రేషణ ఆ ఇంగితాన్ని హరించి వేస్తుంది. మాతృ వాత్సల్యం సతీపతుల పరస్పర అనురాగాన్ని హరింప జూస్తుంది. భార్యకి ఆ గ్రహింపు వుండదు భర్త ఆ కారణంగా క్షతగాత్రుడయి లోలోపల రగిలిపోతాడు. అది మగాడి స్వార్థం. ఆడదాని స్వార్థరాహిత్యమే దానికి కారణం

బాబిగాడు కాలేజీలో చేరాడు.

వాడికి స్కూటరు కావాల్సివచ్చింది. లేకపోతే కాలేజీకి వెళ్ళలేడట – అంది లలిత. అంతవరకూ సుబ్బారావు వాడుతూవున్న స్కూటరుని వాడికి అప్పగించమని అంది సుబ్బారావు కొత్తదాని కోసం అప్లయి చేసాడు. అది రావటానికి టయిం పడుతుంది.

కొత్తది వచ్చాక అది బాబిగాడికే. అందాకానే ఈ ఏర్పాటు. తన స్కూటరు బాబిగాడికి ఇచ్చి తను రిక్షాలో వెళ్ళాలని పురమాయింపు. రెండు కాలేజీలూ చెరో మూలా, వూరికి అందువల్లనా, పెట్రోలు ధర పెరిగినందువల్లనా, ఎకనమీ కోసం ఆ ఏర్పాటు. లలిత తనే నిర్ణయించేసింది. కాదనలేడు సుబ్బారావు. కాని అంతరాంతరాల్లో ఎక్కడో మూల ఏదో ఒక ఇది!

సుబ్బారావు తన స్కూటరుని బాబిగాడికి ఇచ్చేశాడు. తను ఎలాగో సర్దుకుంటున్నాడు. దొరికితే రిక్షా, లేకపోతే సిటీబస్సు, కాకపోతే నడకా, అవస్థగానేవుంది






మీ ప్రియమైన సినీతార "జయప్రద" రాజ్‌కమల్ " శబానా " చీరలో




**ఎస్. సి. – సికింద్రాబాద**

నేనూ, నాతోబాటు యిద్దరు అక్కలూ, ఒక చెల్లీ వున్నాం. మా కెవరికీ వివాహాలు కాలేదు. యింతవరకూ మా పెళ్ళి గురించి పట్టించుకోలేదు. అందరం ఉద్యోగాలు చేస్తున్నాం ... నేను వివాహితుడైన పిల్లల తండ్రిని ప్రేమించాను. వారి భార్య హృదయపూర్వకంగా ఒప్పుకున్నది ...

★ మీ పిచ్చికి జాలివేస్తోంది. ఒక భార్యచేత– 'హృదయపూర్వకంగా' ఒప్పించి మిమ్మల్ని పెళ్ళి లాంటిది చేసుకుందుకు ముందుకొచ్చిన ఆ గృహస్తు రేపిలాగే మీచేత హృదయపూర్వకంగా ఒప్పించి – మీ కంటే చిన్నదాన్ని చేపట్టడని–ఏమిటి గ్యారంటీ !? పెళ్ళి శారీరక సుఖం కోసమే కాదు. అది కూడా మీరు గుర్తుపెట్టుకోవాలి. సుఖం కావలిస్తే పొందండి. మధ్యన యీ పెళ్ళి తతంగం దేనికి ? ఎవరు ఒప్పుకున్నా – యీ సమాజంలో నాన్ ముస్లిమ్‌కి బైగమీ – నేరమే. అంచేత మీది పెళ్ళి అవదు. 'వుంచుకోవడం' అవుతుంది. సామాజిక రక్షణలేని 'సంబంధమే' అవుతుంది.

**ఐ. ఎస్; ఐ. కె. – కొవ్వాడ**

ఆడపెత్తనం బోడిపెత్తనం అన్నారు కదా పెద్దలు, ఎందుకు ?

★ నా పెద్దలెవరూ అలా అనగా వినలేదు నేను. అయినా – అలా అనేవాళ్ళు కుళ్ళుమోతులు అవుతారేగాని పెద్దలెలా అవుతారు ?

**డి. ఎస్. – శ్రీకాకుళం**

మీరు పాఠకులకు యిచ్చే సమాధానాలు నాకు బాగా నచ్చుతాయి, ఎందువలన ?

★ ఏమో ! నా సమాధానంలో ఎక్కడో మీరూ అనుకుంటున్న భావనలు వుండి వుండడం వల్ల కావచ్చు.

**డి. కె. ఆర్. – బైపల్లి**

"న్యాయం కావాలి" చిత్రం చూశాను. ఆ భారతి లాగ ఒక అమ్మాయి కోర్టుకి ఎక్కితే – న్యాయం జరుగుతుందా ?

★ ఏమని చెదుతుంది ?! అక్కడ జగ్గయ్య లాగా తోటి శారద లాయర్ని మోసం చేసిన న్యాయవాది వుండాలి కద ! సినిమా వేరు. జీవితం వేరు. జీవితంలో – ధైర్యం కల పిల్ల – పిల్లని కనిపెంచుకోకల్గాలి; అసలు పెళ్ళికి ముందు పిల్లని కనే స్టేజిదాకా ప్రేమని లాగడం – సభ్యత కాదని తెలుసుకోవాలి. ఈ సమాజంలో – కన్నెతల్లి ఎంత లోకువో – కన్నతల్లికి అంత గౌరవం. ఆడపిల్లలు ప్రేమకీ, సెక్సుకీ మధ్య తేడా గుర్తించాలి; బాధ్యత గల ఆడపిల్ల – పెళ్ళిలోనే ప్రేమనీ, సెక్సునీ ముడివేసుకుంటుంది.

**విజేంద్ర – ఆదోని**

పరాయి స్త్రీలో తన తల్లిని, చెల్లెల్ని చూసుకోలేడు మగవాడు. ఆ స్థాయికి మన సమాజం ఏ రోజుకు చేరుతుంది ?

★ మీ మగవాళ్ళే మారాలి. ఆడది తను కోరుకున్నవాడిని మాత్రమే–ప్రేమగా చూస్తోంది. మిగిలినవారిని – సాటి మనుషులుగా చూడడంలేదా? ఆ స్థాయికి మీరూ ఎదగాలి.

**విక్టర్, ఇందు: అరవింద్ – సిద్దవటం**

ఒక స్త్రీ పరిపాలన చేస్తున్న రాజ్యంలో – స్త్రీ పురుష సమానత్వం, స్త్రీకి స్వేచ్ఛ, స్త్రీకి రక్షణ అనే మాటలు వినబడడం విడ్డూరంగా లేదుటండీ ?

★ నాకు లేదు. ఎందుకంటారా ? ఒక్క కోయిల కూసినంత మాత్రాన వసంతం వచ్చేసినట్టేనా ?! మనది ఎంత చెప్పినా పురుషాధిక్యతతో విర్రవీగుతున్న సమాజం. అందుకే – ఆ ఏలుతున్న ఒక్క ఆడదాన్ని కూడా అవకాశం దొరికితే పడతోయాలని – తాపత్రయం.

**సి. ఆర్. – గుంతకల్**

సైకిల్ బ్రేకు చేతిలో కారు బ్రేకు కాలి దగ్గర వుంటుంది. మరి ప్రేమకు బ్రేక్ ఒక్కడ వుంటుంది ?

★ ఆడదాని ఇంగిత జ్ఞానమే – ప్రేమకు అవసరమైన బ్రేకు అని నా నమ్మకం.

**పి. బి. హెచ్. – నర్సీపట్నం**

...పాపం ! మిమ్మల్ని రిటైరు చేస్తే ఏమౌతుంది ? ఆ ఉద్యోగం యింకొకరికిచ్చినట్టు అవుతుందా ? మీమీద నాకు చాలా జాలిగా వుంది ?

★ ఔరా కుమారి భ్రమరాంబా ! ఎంత సున్నిత హృదయం ! కొందరు మనుషులే రిటైరవగలరు. రచయితలకీ, జర్నలిస్టులకీ రక్తనాళాల్లో – ఇంకుంటుంది ... రాయడం మానేసినా – మరిచిపోరు. వన్స్ ఎ జర్నలిస్టు ఆల్వేస్ ఎ జర్నలిస్టు. అది తెలుసుకో చిట్టితల్లీ. మాలాంటివాళ్ళు జాలిపడవలసిన స్థితిలో వుండరు. అందుకే యీ బుల్లి బుల్లి – జెలసీలు మీకు ! ఔనా ?! ★

---

# అన్వేషణ

కొబ్బరిచెట్టుమీద ఆ కాకి ఇంకా అరుస్తూనే వుంది. ఆకాశంలోంచి తల్లిలాగా చందమామ ఇంకా వెన్నెలని విరజిమ్ముతూనేవున్నాడు. మొదటి ఆటకి వెళ్ళిన 'సినిమా అభిమానుల్ని' తీసుకుని గణగణ గంటలు మోగిస్తూ వీధిలో రిక్షాలు వెళ్తున్నాయి.

సుబ్బారావుకి రెండురోజుల్నించీ జ్వరంగావుంది.

ఆ జ్వరం ఇవాళే తగ్గింది. పథ్యం పుచ్చుకున్నాడు.

కాని వంట్లో ఇంకా కొంచెం నీరసంగానేవుంది.

ఆ సాయంత్రం బాబిగాడి కాలేజీలో ఫంక్షనుంది. అందులో బాబిగాడు ఒకపాట పాడుతున్నానని తల్లితో చెప్పాడు. ఆ పాటవిని ఆనందించాలని తనూ బయలుదేరింది లలిత. సాయంత్రం నాలుగున్నరకి బయలుదేరి వెళ్ళారు తల్లీకొడుకులు. తొమ్మిదిన్నరయింది. ఇంకా రాలేదు. 'తొందరగానే వస్తాం జాగ్రత్తగా వుండ'మని చెప్పి వెళ్ళింది లలిత

తన చేతిలోవున్న పుస్తకాన్ని మరల చదువుకున్నాడు సుబ్బారావు. నిట్టూర్చాడు.

తన తల్లి కళ్ళల్లో మెదిలింది! ఆమె తనకోసం పడే ఆరాటం, ఆమె గుండెల్లో తన గురించి పొంగులు వారే అనురాగం, అభిమానం, ఆప్యాయతా తలపుకి వచ్చాయి. వాటిల్లోని పవిత్రతని గుర్తించిన–మనస్సు శూన్యంలో అన్వేషణ ప్రారంభించింది. పోలికలు వెదకసాగింది. అమ్మ తన గురించి ఆందోళన పడుతూ వుంది. తను ఇన్నాళ్ళూ అమ్మని విస్మరించాడు

అవును. అమ్మని చూసి చాలా రోజులయింది. స్వార్థం అనే లంపటంలోపడి తను ఆమెను విస్మరించాడు ! తన కోసం కాకపోయినా అమ్మ కోసమయినా తను వెళ్ళి రావాలి. అమ్మను చూడాలి. సుబ్బారావు లేచి, ఓపిక తెచ్చుకుని, లోపలికి వెళ్ళాడు. బ్రీఫ్‌కేసులో రెండు జతల బట్టలు సర్దిపెట్టుకుని బయటికి వచ్చాడు. ఇప్పుడు రయిలుబండి వుంది. అది ఎక్కితే తెల్లవారేటప్పటికి అమ్మ దగ్గర వాలగలడు ! గుండెలలో విచిత్రమయిన ఆనందం !

సుబ్బారావు గుండెలు ఆత్రంగా ఎగిరి పడుతున్నాయి.

రోడ్డుమీంచి, బర్రుమంటూ స్కూటరు లోపలికి వచ్చింది. బాబిగాడూ, లలితా వచ్చారు దానిమీద. పాటల పోటీలో బాబిగాడికి ప్రయిజు వచ్చిందట. లలిత ఆగకుండా ఆ కబుర్లే చెప్పింది ఆమె కళ్ళల్లో మెరుపులు !

'నేను వూరు వెళ్ళి రెండురోజుల్లో తిరిగి వస్తాను. జాగ్రత్తగా వుండండి' అన్నాడు సుబ్బారావు – ఆమె వాక్ప్రవాహాన్ని మధ్యలో ఆపుచేసి. అప్పుడు, ఆమె అతన్ని గమనించింది. 'అదేమిటి ? ఎక్కడకీ ప్రయాణం ? అసలే మీ వంట్లో బాగా లేదు గదా ?' అంది సానుభూతితో. అనురాగం మొత్తాన్ని ఆమె నుంచి బాబిగాడు దోచుకోగా, మిగిలిందది !

'నా వంట్లో ఇప్పుడు బాగానే వుందిలే. ఫర్వాలేదు' అన్నాడు సుబ్బారావు, నవ్వి.

లలిత తృప్తి పడలేదు. 'అయితే మాత్రం ? ఈ అర్జంటు ప్రయాణం ఏమిటి ? ఏమయిందీ ?' అంది లలిత.

'ఏం కాలేదులే. అమ్మను చూడాలనిపించింది. చూసి వస్తాను' అని చెప్పి బ్రీఫ్‌కేసుతో రోడ్డుమీదికి నడిచాడు సుబ్బారావు, ట్రయినుకి టయినవుతోందని. అలాగ – వెళ్తున్న అతన్ని ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి చూస్తూ వుండింది లలిత. ★

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]




(గత సంచిక తరువాయి)

వెంకట్ వెళ్ళిన నాలుగోరోజున ఒక వ్యక్తి వెతుక్కుంటూ రాఘవయ్యగారింటికివచ్చాడు. అతన్నెపుడూ, ఎక్కడా చూసిన గుర్తులేదు రాఘవయ్యగారికి.

అదే అడిగారు.

ఆ వ్యక్తి నవ్వుతూ తన పాతకోటు జేబులో నుండీ ఒక ఉత్తరం తీసి చూపెట్టాడు. ఒకసారి ఆ వ్యక్తి ముఖంలోకి చూసి, ఎడంచేత్తో కళ్ళజోడు సవరించుకుని ఆ ఉత్తరాన్ని చదవటం ఆరంభించారు రాఘవయ్యగారు.

"అతని దగ్గర నాలుగు రొట్టెలు దొరికాయి! వాటిని ఎనిమిది భాగాలు చేసాము! ఒకటి అతనికే ఇచ్చాము! ఒకటి 'కన్నతల్లి'కి ఇచ్చాము! ఒకటి మీకు పంపిస్తున్నాము! మిగిలిన అయిదూ అనాథలకు! ఈ విభజనగానీ, ఈ నిర్ణయాలుగానీ మీకేవిధమైన కష్టాన్నీ కలిగించవని నా అభిప్రాయం! ఇపుడు మీకు అందిన 'రొట్టె' కన్నా పెద్ద 'రొట్టె'ను మీరు పోగొట్టుకుని ఉండవచ్చు! అయినా కూడా మేము మీకు చేయగలిగింది అంతే! తర్వాత, ఇతను మీ కాలిని చూస్తాడు! నమ్మకమయినవాడు! చూపించుకోండి!" క్రింద సంతకం లేదు. అయినా ఆ ఉత్తరం ఎవరు వ్రాసారో రాఘవయ్యగారు తేలిగ్గానే ఊహించారు. అందులోని విషయాలకు ఆయన నిజంగా చాలా ఆనందించారు. కన్నకొడుకులు కూడా చేయలేని పనిని అతను సాధించాడు! దాదాపు శిథిలమైపోయిన ఆ సంసారానికి పునరుజ్జీవితం ప్రసాదించాడు!

సంతోషాతిశయంతో ఆయనకు సగం జబ్బు నయమైపోయినట్లుగా అన్పించింది.

తారను పిల్చి ఉత్తరం ఇచ్చారు.

తార ఆ వచ్చినాయనకు వినయంగా నమస్కరించింది. ఆయనకు అతిథి మర్యాదలు చేసింది. నాగరత్నమ్మ ఇంట్లోలేదు! అందువల్లనూ, తండ్రి ఇచ్చిన ప్రోత్సాహంతోనూ ధైర్యంగా అతనికి మంచి భోజనం తయారుచేసి పెట్టింది. అతనిచ్చిన డబ్బుని చాలా జాగ్రత్తగా తీసుకుంది. పెట్టెలో బట్టల అడుగున భద్రపరచింది.

ఆ వ్యక్తి రాఘవయ్యగారి కాలిని చాలాసేపు పరీక్ష చేసారు. ఎప్పట్నుంచీ అలాగ ఉన్నదో అడిగారు. ప్రస్తుతం డాక్టరిస్తున్న ట్రీట్‌మెంటును తెలుసుకున్నారు. ఆయన వాడుతూన్న మందులు చూసారు. తర్వాత ఆయన తన దగ్గరున్న బ్యాగ్‌లోంచి రెండు-మూడు రకాల సీసాలు తీసి తారకు చూపెట్టారు. ఒక రకం ఉదయాన్నే మర్దన చేయమన్నారు. మరో రకం రాత్రికి పడుకునే ముందు మర్దన చేయమన్నారు. ఇంక మూడో రకాన్ని చూపిస్తూ "దీనికి ఒక టైమంటూ ఏమీ లేదమ్మా! కొద్ది కొద్దిగా తీసుకుని అపుడపుడూ కాలికి, చేతికి వ్రాసి మర్దన చేస్తూ ఉండాలి" అన్నారు. ఆ తర్వాత నవ్వుతూ "ఫర్వాలేదు! భయపడాల్సిందేమీలేదు! ఆ డాక్టరుగారిస్తున్న మందుల ప్రభావమో, మరి మీ మంచితనమో కానీ ఆయన చాలా త్వరలోనే కోలుకుంటారని నాకనిపిస్తున్నాది. ఇదిగో — ఇవి కూడా వాడితే ఇంకా త్వరగా కోలుకోవటానికి సహాయపడుతుంది" అన్నారు.

ఆయన వెళ్ళిపోయారు.

మెరిసే కళ్ళతో, ఆనందంగా చూస్తూ "మీకు త్వరగా తగ్గిపోయి, లేచి తిరగ్గలిగితే అందరిలోకీ అదృష్టవంతురాల్ని నేనే నాన్నగారూ! కేవలం నా కోసం మీరు లేవగలుగుతారు!" అంది తార.

రాఘవయ్యగారు మాట్లాడలేదు. ఎడమచేతిని ఎత్తి కుమార్తె తల నిమురుతూ ఉండిపోయారు.

"తారా! ఆ డబ్బుతో ఏం చేద్దాం?" అన్నారు, రాఘవయ్యగారు.

"నాన్నా! మీరేమీ అనుకోనంటే నేనొక విషయం చెబుతాను."

"నా బిడ్డలు అందరిలాంటివారూ కాదమ్మా! నేనెన్ని ఒడిదుడుకులకు లోనయినా నేనింత నిబ్బరంగా ఉన్నాను అంటే — దానికదే కారణం! చెప్పమ్మా, చెప్పు! నేనేమీ అనుకోను."

"మన చంద్రం ..." చెప్పటానికి తారకు భయమేస్తున్నాది. ఏనాడూ లేనిది తండ్రి ఎదుట ఆ విషయం చెప్పాలంటే తారకు చాలా జంకుగా ఉన్నది.

"ఆఁ -- మన చంద్రం — ?"

తర్వాత చెప్పు అన్నట్లుగా రెట్టించారు రాఘవయ్యగారు.

"మన చంద్రం చదువుమానేసి ఉద్యోగంలో చేరాడు నాన్నా!"

"ఏమిటీ! మన చంద్రం — ఉద్యోగంలో చేరాడా?" ఆయనకు చాలా ఆశ్చర్యమేసింది.

"అవున్నాన్నా!" చాలా మెల్లిగా సమాధానం చెప్పింది తార.

"అదేమిటమ్మా! నాతో ఒక్కమాటయినా చెప్పకుండా! అయినా వాడా నిర్ణయానికి ఎందుకొచ్చినట్లు?" తనలో తనే అనుకుంటూన్నట్లుగా అన్నారు రాఘవయ్యగారు.

తార మాట్లాడలేదు.

"ఇహ ఈ నాన్న వల్ల కుటుంబానికి ఏమీ లాభం ఉండదు అనుకుని ఆ నిర్ణయానికి వచ్చాడా?" ఆయన గొంతులో తొంగి చూసిన బాధకు తార కళ్ళల్లోకి గిర్రున నీళ్ళు తిరిగాయి. ఆయన చేతిమీద చేయివేసి అంది - "అలా అనుకోబోకండి నాన్నా! మీరలా బాధపడొద్దు! పోయినసారి వాడు వచ్చింది, ఈ విషయం మీకు చెప్పాలనే వచ్చాడు. కాని, మీతో చెప్పటానికి భయపడి నన్ను చెప్పమన్నాడు. ఈ విషయం మీకు చెప్పాలంటే నాకూ నోరు రాలేదు."

రాఘవయ్యగారు ఏమీ మాట్లాడలేదు. ఆలోచిస్తున్నట్లుగా ఉండిపోయారు. తార ఆయన చేతిని మెల్లగా నిమురుతూ చాలా మృదువుగా అన్నది.

"నాన్నా! మీరు వాడిని అపార్థం చేసుకోబోకండి నాన్నా. వాడు మీకు చెప్పకుండా చెయ్యాలని అనుకోలేదు. మీ పెద్దరికాన్ని కించపరచటానికో, లేక వాడు పెద్దవాడినయిపోయాననే ధీమాతోనో



**జరిగిన కథ—19** కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం. ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకుంటుంది తార. ప్రకాశం మంత్రివర్గం ఏర్పాటయిన తరువాత కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. తత్ఫలితంగా వెంకట్‌ను పట్టుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తుంటుంది పోలీసుశాఖ. అతనిప్పుడు పూర్తిగా వేషం మార్చేసి తప్పించుకు తిరుగుతుంటాడు. తమకి దొరక్కుండా తప్పించుకు తిరుగుతున్నాడనే కోపంతో వెంకట్ ఇంటిపై మెరుపు దాడులు చేస్తూ అతని కుటుంబ సభ్యులతో చాల అసభ్యంగా, అమానుషంగా ప్రవర్తించుతుంటారు పోలీసులు. వెంకట్ ఆజ్ఞపై తార పిల్లలతో పుట్టింటికి వెళ్తుంది. భాగస్వామిని నమ్మి మోసపోవడంతో, రాఘవయ్యగారు చాలా కృంగిపోయారు. పిల్లలను ప్రసాద్ తనవెంట తీసుకువెళ్తాడు. ఇక నాగరత్నమ్మ నోటికి, చేసే పనులకు అదుపు అనేది లేకుండాపోయింది. రాఘవయ్యగారికి పక్షవాతం రావడంతో కుడికాలూ, చెయ్యీ పడిపోతుంది. తారను తీసుకు రమ్మని వెంకట్ మనిషిని పంపితే రాఘవయ్యగారు అంగీకరించకపోవడంతో వెళ్ళలేకపోతుంది. డి. యస్. పి. పళనియప్పన్ 37 మంది విప్లవకారుల ప్రాణాలు తీసాడు. అతని పేరు వింటేనే అందరూ వణికిపోతున్నారు. చంద్రం ఉద్యోగంలో చేరతాడు. 'మునగాల పరగణా'లో తమ పార్టీ చాలా వెనుకబడి ఉండడంతో అక్కడికి వెళ్తాడు వెంకట్.



ఏ పని చేయలేదు! మీ అనారోగ్యమే కాకుండా, నాయీ అశక్తత కూడా వాడి నిర్ణయానికి రావటానికి కారణమనుకుంటాను నాన్నగారూ! నేనెన్నివిధాల చెప్పినా వాడు వినలేదు. పైగా, 'ఎంత చదివినా చేయాల్సింది ఏదో ఒక ఉద్యోగం! కావాలనుకున్నపుడు అది దొరకనూవచ్చు! దొరక్కపోనూ వచ్చు! ఇవ్వాళ అది మన కాళ్ళదగ్గరకు వెదుక్కుంటూ వచ్చినపుడు మనమెందుకు తన్నేయాలి'' అని వాదించాడు. వాడికి ఎలా చెప్పాలో నాకూ అర్థం కాలేదు నాన్నా.''

కొంచెంసేపు అయ్యాక అడిగారు.

''ఏం ఉద్యోగమమ్మా ?''

''కంట్రాక్టరు దగ్గర ఏదో పనిట నాన్నా !''

''ఏం చేద్దామంటావు? నీ ఆలోచన ఏమిటి?''

''అదే నాన్నా ! వాడికి మీరు ఆర్థికంగా కాస్త సహాయం చేస్తే వాడే స్వంతంగా ఏమైనా చేసుకోగల్గుతాడేమో కదా !''

ఆలోచిస్తున్నట్లుగా అన్నారు.

''మరి మిగిలినవాళ్ళు కూడా ఒప్పుకోవాలి కదమ్మా! మోహన్‌తో ఏ చిక్కూ లేకపోయినా రామారావు సంగతి కాస్త ఆలోచించాల్సిందే కదా!''

తారకు కోపం వచ్చింది. నాన్న పరిస్థితి తెల్పుతూ ఎన్ని ఉత్తరాలు వ్రాసినా ఒక్కసారికూడా తొంగి చూడలేకపోయాడు. అలాంటి వాడికి భాగం పంచటానికి ఈయన ప్రాకులాట చూస్తే నిజంగానే తారకు కోపం వచ్చింది. కాని, పైకి మాత్రం ఏమీ అనలేదు. 'ఎంతయినా, వాడు కూడా ఆయనకు మాలాంటివాడే కదా !' అనుకుంది.

డబ్బువచ్చిన విషయం నాగరత్నమ్మకు మాత్రం తెలియజేయవద్దన్నారు. ఆ రోజే చంద్రాన్నీ, ప్రసాదునీ అర్జంటుగా రమ్మని ఉత్తరం వ్రాయించారు.

రాఘవయ్యగారికి మందు వాడటం కూడా ఆ రోజే ప్రారంభించింది తార.

* * *

మార్చి 16వ తేదీ, 1950!

వెంకట్ వెళ్ళాక మళ్ళీ ఏ కబురూ తెలియలేదు.

రాఘవయ్యగారికి మందులు జాగ్రత్తగా వాడుతోంది తార. ఆ వైద్యుడిచ్చిన నూనె కూడ క్రమం తప్పకుండా మర్దన చేస్తోంది.

అలా చేస్తూంటే రాఘవయ్యగారు కూతురి వంక జాలిగా చూసేవారు. ఒకసారి అన్నారు కూడాను. ''అమ్మా, తారా! నువ్వు కేవలం నా కోసమే ఇక్కడ ఉన్నావేమో తల్లీ! నిజంగా నువ్వు లేకపోతే ఈపాటికి నేనేమయిపోయి ఉండేవాడినో!''

''ఛ! అదేమిటి నాన్నా! అలా అంటారు'' అంది తార.

ఆ రోజు కూడా రాఘవయ్యగారికి మర్దనచేసి, చేతులు కడుక్కుని ఇంటిలోకి వచ్చింది.

నాగరత్నమ్మ అన్నం తినేసి 'సినిమా'కని వెళ్ళింది. తార ఇంకా భోజనం చేయలేదు. రేణుని తండ్రి దగ్గర కూర్చోబెట్టి లోపలకు వెళ్ళింది.

కంచం కడుక్కుని అన్నం పెట్టుకోబోతూండగా తండ్రితో ఎవరో మాట్లాడటం వినిపించింది. మళ్ళీ అన్నం కుండమీద మూతపెట్టేసి గుమ్మంలోకి వచ్చింది తార. బయట వెంకటేశ్వరావు ఉన్నాడు. అతడ్ని చూడంగానే తార గబుక్కున బయటకు వచ్చింది.



ఏవి(టో దాని) మోయలేక చస్తున్నావా? ఇంతకీ దేనికొచ్చిందా కప్పు?

వెయిట్ లిఫ్టింగ్ పోటీల్లో!

— శేఖర..

క్షమించాలి సార్.. రావటం కాస్త ఆలస్యమైంది!

"ఎప్పుడు రావటం? అక్కడ అంతా బాగున్నారా?"

"ఆఁ – అంతా బాగానే ఉన్నారు."

"నిలబడే ఉన్నావేమిటి? ఇలారా! ఇలావచ్చి కూర్చో! నిన్ను చూసి ఎన్నాళ్ళయిందో! మంచినీళ్ళు కావాలా?"

"ఊఁ – కొంచెం ఇవ్వు."

"తెస్తానుండు." రెండడుగులు లోపలకు వేసిందే, మళ్ళీ ఆగిపోయింది తార. వెనక్కు తిరిగి ఆపేక్షగా చూస్తూ అడిగింది—

"అసలు అన్నం తిన్నావా?"

"ఆఁ – ఆఁ – తిన్నాను."

"సరే! మంచినీళ్ళు తెస్తాను."

ఖాళీగ్లాసు తార చేతికిస్తూ "పిల్లలేరి?" అన్నాడు వెంకటేశ్వర్రావు.

"స్వప్న నిద్రపోతోంది. ఇదిగో – రేణు ఇక్కడే ఉందిగా!" అప్పుడే అతడ్ని పరీక్షగా చూసింది అతడి ముఖంలో జీవకళ లేనట్టుగా, ఏదో భయంతోనూ, ఆందోళనతోనూ బాధపడుతున్నట్టుగా – పీక్కుపోయి ఎలాగో ఉంది! అతని చూపులు ఇక్కడ చూస్తున్నా, ఎక్కడో ఆలోచిస్తున్నాడని స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది.

శూన్యంగా ఉన్న అతని చూపులూ, జీవంలేని ఆ మాటలూ, పరధ్యానపు చేష్టలూ – తారకు ఏదో అనుమానం వేసింది.

'ఏం జరిగింది! ఎందుకలా ఉన్నాడు!'

"వెంకటేశ్వర్రావు!" తార పిలుపుకు ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటయ్యా? ఏం జరిగింది?"

"అబ్బే! ఏంలేదే! ఏముంది జరగటానికి?" అన్నాడేకానీ, ఆ మాటల్లో తెచ్చిపెట్టుకున్న బింకం కనిపిస్తూనే ఉంది!

"అత్తయ్యా, మామయ్యా కులాసాగా ఉన్నారా?" ఆత్రుతగా అడిగింది.

"ఆఁ – అంతా బాగానే ఉన్నారు."

"మీ బావగారి కబుర్లు ఏమయినా తెలుస్తున్నాయా?"

"ఊఁ – వెంకట్ ఇపుడు నూజెళ్లలోనే ఉన్నాడు."

## తార

"నూజెళ్లలోనా?" ఆశ్చర్యంగా అడిగింది తార

"ఆఁ – అవును! నూజెళ్లలోనే! కొద్దిగా జ్వరం వస్తున్నాదని ఇంటికి వచ్చేసాడు."

గబుక్కున మంచంమీంచి లేవబోయారు రాఘవయ్యగారు "ఏమిటీ! వెంకటేశ్వర్రావు! నువ్వు చెప్పేది నిజమేనా? బాబుకు జ్వరమా?" ఆదుర్దాగా, కంగారుగా అడుగుతూన్న రాఘవయ్యగారి దగ్గరకు గబుక్కున వచ్చాడు వెంకటేశ్వర్రావు ఆయన్ని మెల్లగా వెనక్కు పడుకోబెడుతూ "మీరేం కంగారు పడబోకండి పెదనాన్నా! వెంకట్ కేమీకాలేదు. అతను క్షేమంగానే ఉన్నాడు! ఏదో కాస్త జ్వరం అంతే!"

## అరికాళ్ళకింది భూమి

అరికాళ్ళకింది మట్టి తొలగిపోతుంటే
నమ్మిన స్నేహాలు ముఖాలు తిప్పేస్తే
ఆప్యాయంగా పలకరించిన చూపులే
పరుష వాక్యాలలో ఎరుపెక్కితే
ఆ క్షణాల: నిజంగానే నీ గుండెను
మరతో తిప్పినంత బాధ కలుగుతుంది,
ఇంటా బయటా ప్రేమానురాగాలు నశించి
అశాంతితో మనస్సు నిస్సహాయంగా
ఏమీ చేయలేని స్థితిలోకి జారినా
నీ చుట్టూవున్న దీనులను
ఈ వ్యవస్థ కసిరి మురికి కాల్వలమీదికి
కూలిపోతున్న గోడల పంచకి
రైల్వే ప్లాట్‌ఫామ్‌ల భయాల ఆశ్రయాలకి
తరిమిన పేదలను శ్రమజీవులను చూడూ
నీ ఆత్మవిశ్వాసం
చారిత్రక ఆశావాదం
అరికాళ్ళకింద తొలగిన మట్టి బదులు
నిలుపుతుంది చెరగని నమ్మకాల భూమిని!

— నిఖిల్

"కాదు! ఏదో ఉంది! నువ్వు దాస్తున్నావు! నిజం చెప్పవూ! ఉత్త జ్వరమే అయితే నువ్విలా ఉండవు! బాబూ! నిజం చెప్పవూ! వెంకట్ కేమయింది?" రాఘవయ్యగారి కళ్ళల్లోకి జివ్వున నీళ్ళు వచ్చేసాయి!

అప్పటివరకూ ఒక విధమైన అచేతనావస్థలో ఉన్న వెంకటేశ్వర్రావు ఆయన్ని చూసి కాస్త సర్దుకుని జాగ్రత్తపడ్డాడు!

"నిజం పెదనాన్నా! ఏంలేదు! ఉత్త జ్వరమే! నా మాట నమ్మండి! ఏమీలేదు!" ఆయన చేతిలో చేయి వేస్తూ అన్నాడు.

బిక్కముఖంతో నిలబడిపోయిన తార వంక చూస్తూ అన్నాడు

"ఏం భయం లేదక్కా! మామూలు జ్వరమే! పర్వాలేదు! అదే తగ్గిపోతుంది! కాకపోతే ఇంట్లోనే ఉన్నాడు కదా! పిల్లల్ని చూడాలిట! ఏం తోచటం లేదట! అందుకని నిన్నూ, పిల్లల్నీ తీసుకు రమ్మన్నాడు."

భయం భయంగా, అనుమానంగా చూసింది

"త్వరగా బయలుదేరితే మూడు గంటల బండికి వెళ్ళవచ్చు."

ఇహ భోజనం చేయాలన్పించలేదు తారకు! గ్లాసుడు మంచినీళ్ళు త్రాగేసింది.

రాఘవయ్యగారు వెంకటేశ్వర్రావుని అనేక ప్రశ్నలు వేస్తూ- అసలు విషయం ఇంకేమయినా ఉందేమోననీ, దాన్ని తెలుసుకోవాలనీ ప్రయత్నం చేస్తున్నారు.

తార గబగబా తనవీ, పిల్లలవీ బట్టలు సర్దుకుంది. రేణు సామాన్లన్నీ సర్దుకుంది

తండ్రి దగ్గరకు వచ్చి బావురుమంది.

రాఘవయ్యగారు ఎన్నో విధాలుగా ధైర్యం చెబుతూ ఊరడించారు. ఆయనకూ మనసులో భయంగానే ఉన్నది! కాని, తన అధైర్యం కనిపెడితే తార ఇంకా బేజారయిపోతుంది అని లేని గంభీర్యాన్ని కుమార్తె ముందు ప్రకటిస్తున్నారు.

తార దుఃఖానికి రెండు కారణాలు! ఒకటి - వెంకటరత్నం ఎలా ఉన్నాడో, ఏమిటో అనే బెంగ అయితే – రెండోది రాఘవయ్యగారు! ఆయనకు సాయంత్రం, ప్రొద్దుటా మందులూ, మర్దనా - ఒకటేమిటి! పసిపిల్లవాడికి చేసినట్టుగా ప్రతి పనీ

ఆయనకు చేయవలసిందే! కానీ – ఎవరు చేస్తారు! ఎవరు చూస్తారు!

"ఫర్వాలేదులేమ్మా! ఊరుకో! ఏడవబోకు! చూడూ – ఎవరూ లేకపోతే మీ అమ్మే చేస్తుంది!"

గబుక్కున తారకు ఒక ఆలోచన వచ్చింది. కళ్ళు తుడుచుకుంటూ లేచి, అద్దెకున్నవాళ్ళ ఇంట్లోకి వెళ్ళింది. వాళ్ళ అబ్బాయి పరీక్ష తప్పి ఇంట్లోనే ప్రైవేటుగా చదివి పరీక్షకు వెళ్తున్నాడు. అతనికి అన్నీ వివరించి చూడమని చెప్పింది. వాళ్ళు సంతోషంగా ఒప్పుకున్నారు. ఆవిడకూడా తార కళ్ళు తుడుస్తూ "బాధపడబోకమ్మా! రోజులన్నీ ఒకేలా ఉండవు! తప్పకుండా అంతా మంచే జరుగుతుంది! ముఖ్యంగా నీ మంచితనమే అందర్నీ కాపాడుతుంది! పసుపు కుంకుమలతో నూరేళ్ళు చల్లగా ఉంటావు! దేవుడు మిమ్మల్ని తప్పకుండా ఆశీర్వదిస్తాడు." అంటూ ఓదార్చుతూ, కుంకుమబొట్టు పెట్టి దీవించింది.

"దేవుడా!" ఆశ్చర్యపోయింది తార. పెళ్ళి కాక పూర్వం ఎపుడో ఒకటీ అరా దేవుడంటూ పూజలు చేసిందేమోకానీ, ఆ తర్వాత మాత్రం 'దేవుణ్ణే' పూర్తిగా మరచిపోయింది. 'మంచితనమే దేవుడు' అనే వెంకట్ బాటలోనే సాగిపోతూన్న తారకు మళ్ళీ 'దేవుడు' ఇపుడు గబుక్కున ఎదురయ్యాడు.

ఆ అబ్బాయిని తీసుకొచ్చి రాఘవయ్యగారి మందులన్నీ చూపించింది. ఏ మందు ఎపుడు వేయాలో చెప్పి, ఏ మానె ఎపుడు మర్దన చేయాలో – అన్నీ వివరంగా చెబుతూ ఊరే కన్నీటిని తుడుచుకుంది.

*   *   *

తార మూజెల్ల ఇంటికి వచ్చేసరికి ఇంకా నాలుగు గంటలు కూడా కాలేదు.

ఇంటిచుట్టూ నిలబడి ఉన్న పోలీసుల్ని చూడగానే తారకు పై ప్రాణాలు పైనే పోయాయి!

"వెంకటేశ్వర్రావు! ఏమిటిదంతా?"

"వెంకటరత్నం ఇంట్లోనే ఉన్నాడు కదక్కా. అందుకని ఈ ఇంటికి మరో విప్లవకారుడెవరయినా వస్తే పట్టుకోవచ్చనీ, వెంకట్ పారిపోకుండానూ వీళ్ళు కాపలా ఉన్నారన్నమాట."

"వెంకట్ భార్యా, పిల్లలూ" అని పోలీసులకు చెప్పి లోపలకు తీసుకొచ్చాడు.

## అలల నుండి విద్యుత్తు!

పశ్చిమ జర్మనీలోని డోర్నియర్ కంపెనీ వారు సముద్రపు అలల నుండి విద్యుత్తును ఉత్పత్తి చేయగల జల విద్యుత్కేంద్రాన్ని నిర్మించారు. దీనికి పెద్దగా ఆధునిక పరికరాలు అక్కర్లేదు. సుమారు 10 నుండి 15 మీ. పొడవు గల గొట్టాన్ని సముద్రంలో నీరు లోతుగా వుండే ప్రాంతంలో అమరుస్తారు. అలల తాకిడికి గొట్టంలో నీటిమట్టం, అందువలన లోపలి పీడనం మారుతుంటుంది. పీడనం మారుతుండటంతో, దాని ననుసరించి ఒక టర్బైన్ పని చేస్తుంటుంది. దీనితో 200 వాట్ల విద్యుత్తు తయారు కాగలదు. ప్రస్తుత సంక్షోభ పరిస్థితుల్లో, చిన్న దేశాలకు ఇలా రకం విద్యుత్కేంద్రాలు చాలా ఉపయోగకరంగా వుండగలవని భావిస్తున్నారు.

పిల్లలను చూడగానే భోరుమంది సత్యవతి.

కళ్యాణి కూడా అక్కడే ఉన్నది. గబుక్కున ఎదురొచ్చి ఒదిన చేయి పట్టుకుంది. ఆమె కళ్ళ నిండా నీళ్ళు నిండి బుగ్గలమీదికి జారిపోతున్నాయి. గిరిజ పద్మను ఎత్తుకుని విచారంగా చూస్తూ, క్రింది పెదవిని పంటితో నొక్కుకుంటూ నించున్నది. రేణుకను తీసుకుని దమయంతి ఏడ్చేస్తున్నాది.

వీళ్ళందర్నీ చూడగానే తారకు చాలా భయం కలిగింది! అనలేదో జరిగిపోయిందనే అనుకుంది.

గబుక్కున గదిలోకి అడుగు పెట్టింది!

లోపల —

మంచంలో —

అబ్బ! వెంకట్ ఉన్నాడు!

వాళ్ళందర్నీ చూడగానే అసలు ప్రాణంతో ఉన్న వెంకట్‌ను చూడగలనా అనే భయంతో లోపలకు వచ్చిన తార వెంకట్‌ను సజీవంగా చూసి తేలిగ్గా గాలి పీల్చుకుంది!

కాని, బాగా చిక్కిపోయి, చాలా నీరసంగా, మగతగా పడుకుని ఉన్న వెంకట్‌ని చూస్తూ 'ఏమిటిలా అయిపోయారు' అనుకుంటూ కంగారుగా దగ్గరకు వెళ్ళింది.

ప్రక్కన కిటికీలో చాలా రకాల మందులు ఉన్నాయి! పదిహేను రోజుల క్రితం వచ్చి అంత సరదాగా గడిపిన వెంకట్, బాగా చిక్కి, తెల్లగా పాలిపోయినట్లుగా మంచంలో ఉన్న ఈ వెంకట్ ఒకరేనా!

అట్లా వెంకట్‌ను చూస్తున్నకొద్దీ తారకు కళ్ళు నీటితో నిండిపోయి మసకగా కప్పిస్తున్నాను. పయిటచెంగు నోటికి అడ్డం పెట్టుకొని శబ్దం బయటకు రాకుండా ఏడుస్తూన్న తారను ఓదార్చుతూన్నట్లుగా భుజంమీద చేయి వేసింది కళ్యాణి.

తర్వాత వివరంగా చెప్పింది కళ్యాణి. 'వెంకటరత్నం అక్కడ మునగాల పరగణాకు వెళ్ళాక అతని ఆరోగ్యం కొంచెం దెబ్బతిన్నదట! ఆ రోజుల్లో ఇలాగ దాక్కున్న విప్లవకారులకు నిజంగా సహాయం చేసింది పేదప్రజలే! వెంకట్ లాంటివాళ్ళు ఎంత సహాయం చేసినా, వాళ్ళ పేదరికం అంత త్వరగా మాసిపోదు! ఒకవైపునించీ వీళ్ళు సహాయం చేసి వాళ్ళను పైకి తీసుకురావాలని ఎంతగా ప్రయత్నిస్తున్నారో – మరో ప్రక్కన స్వార్థపరులైన కొందరు పెద్దలు - పెట్టుబడిదారీ పద్ధతిలో సామాన్య ప్రజల రక్తమాంసాలు పీల్చేస్తూన్న బూర్జువా నాయకులు అంతగా వాళ్ళను క్రిందికి అణచివేస్తున్నారు!

'అందరూ పల్లకీ ఎక్కితే మోసేవాడు ఎవరు' అని ప్రశ్నించే బూర్జువాలకూ, 'అసలు పల్లకీ ఎందుకూ, అందరితోపాటు నువ్వూ నడువు' అనే కమ్యూనిస్టులకూ పొంతన కుదరవే కుదరదు!

అలాటి పేదవాళ్ళు పాపం వెంకట్‌కు జ్వరం అనే విషయం తెలియక వాళ్ళు తినే పచ్చడి మెతుకులే పెట్టి, గంజినీళ్ళే పోయటమూ, వెంకట్ కూడా మొండితనంగా అనే తిని రాత్రిళ్ళు కార్యక్రమాల్లో పాల్గొంటూ జ్వరాన్ని నిర్లక్ష్యం చేయటంతో అది బాగా ముదిరిపోయింది. కళ్ళు తిరిగి పడిపోయిన వెంకట్‌ని పట్టుకోబోతే పొయ్యిమీది పెనం లాగా కాలిపోతున్నాది అతని శరీరం! అప్పటికిగానీ అతని జ్వరం సంగతి ఎవరికీ తెలియలేదు! తెలియగానే గబగబా డాక్టర్ని తీసుకొచ్చారు. అతనికి టైఫాయిడ్






లాగా ఉందని చెప్పి మందులు ఇచ్చారుట! ఆ మారుమూల పల్లెలో, ఆ పేద ప్రజలకు ఏం చేయాలో తెలియక, మూసిన కన్ను తెరవకుండా అపస్మారక స్థితిలో ఉన్న వెంకట్‌ని చూసి భయపడి పోయి అటునుండి వస్తూన్న ఒక లారీని ఆపి, అందులో వెంకట్‌ని తీసుకొచ్చి గుడ్లవల్లేరు అచ్యుతరామయ్యగారికి అప్పజెప్పేసారు!

ధనలక్ష్మికి ఇల్లంతా దాక్కోవటానికి వచ్చిన కమ్యూనిస్టు వీరులే ఉన్నారు! వాళ్ళంతా వెంకట్‌ని చూసి చాలా గాభరాపడ్డారు! వెంటనే డాక్టర్ని తీసుకొచ్చారు! ఆయన మందులు వాడటం ప్రారంభించిన నాలుగో రోజున పోలీసుల దాడి జరిగింది. ఎక్కడివాళ్ళక్కడ పిట్టల్లాగా ఎగిరి పోయారు! మంచంలో కదలకుండా, కనీసం కళ్ళు కూడా తెరవలేని స్థితిలో ఉన్న వెంకటరత్నమూ, అతనికి ఇంజెక్షనిస్తూన్న డాక్టరూ మాత్రమే ఇంట్లో మిగిలారు.

వెంకటరత్నాన్ని గుర్తుపట్టలేదు! అతనికి జ్వరం అని చెప్పిన డాక్టర్ని నమ్మలేక చేయి వేసి చూసారు. చుర్రున కాలటంతో 'అబ్బా' అంటూ చటుక్కున చేయి లాక్కుని వెళ్ళిపోయారు.

తారకు కబురు చేద్దామని అనుకున్నారు. మళ్ళీ 'ఆ అమ్మాయి వచ్చి మాత్రం ఏం చేయగలదు! అనవసరంగా కంగారు పెట్టటం తప్పించి ప్రయోజనమేముంటుంది! మనమంతా ఉన్నాం కదా!' అనుకుని మానేసారు.

# తార

మార్చి 14వ తేదీ!

వెంకటరత్నం ఆచూకీ తెలుసుకుని మరీ వచ్చారు పోలీసులు! అందరూ తప్పించుకున్నారు! కాకపోయినా వాళ్ళు కేవలం వెంకట్ కోసమే వచ్చారు!

బ్రిటిష్ సైన్యానికి అల్లూరి సీతారామరాజుని పట్టుకోవటం ఎంత అసాధ్యమయిందో — వీళ్ళకు వెంకట్‌ను పట్టుకోవటం అంతకన్నా కష్టతరమై పోతున్నాది! అందుకే అచేతనంగా పడివున్న వెంకట్ కోసం అర్జెంటుగా వచ్చిపడ్డారు! అప్పటికి డాక్టరు కూడా అక్కడే ఉన్నాడు!

ఈసారి పోలీసులు వెంకటరత్నాన్ని బాగా పరిశీలించి చూసి అతను వెంకట్ అనే నిర్ధారణ చేసుకున్నారు.

వాళ్ళ దృష్టిలో — వాళ్ళంటే ప్రభుత్వం దృష్టిలో — 'విప్లవకారులంతా దేశద్రోహులు! కాబట్టి అలాటి దేశద్రోహులకు వైద్యం చేయటం మహానేరం!' అని చెప్పి డాక్టర్ని కూడా కొట్టారు' ఇంకెప్పుడూ ఇలాటి నేరాలు చేయవద్దని వార్నింగు ఇచ్చి పంపేసారు! 'ఇహ వాడే ఛస్తాడు!' అనుకున్నారో, ఏమో — వెంకటరత్నాన్ని అలాగే వదిలేసి వెళ్ళిపోయారు!

ఈ విషయం అందరకూ తెలిసిపోయింది! అసలు పత్రికలలోకూడా బాహాటంగా ప్రకటించారు' 'వెంకటరత్నానికి వైద్యం చేయటానికి ఎవరూ సాహసించవద్దనీ, అలా ఎవరైనా వైద్యం చేసినట్టుగా తెలిస్తే చట్టరీత్యా కఠినమైన శిక్షను అనుభవించాల్సి వస్తుందనీ' ప్రకటనలు కూడా చేసారు. అది చూసాక ప్రతి డాక్టరూ భయపడి పోతున్నారు! ఎవ్వరూ ముందుకు రాలేదు! వెంకట్ పరిస్థితి రోజు రోజుకూ దిగజారిపోతున్నాది!

ఆ పరిస్థితుల్లో ఏంచేయాలో తెలియక, మరో దారి లేక రాత్రికి రాత్రి బండి కట్టించి అతన్ని తీసుకొచ్చి మాజెల్లలో దింపేసారు.

అతన్ని చూడగానే సత్యవతి 'అతనిలో ఇంకా ప్రాణం ఉన్నాది' అంటే నమ్మలేకపోయింది. అలాటి వెంకట్‌ను ఆ ఊరి డాక్టర్ చూసి ఆ మందూ, ఈ మందూ మార్చి అతన్ని బ్రతికించటానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు.

అదంతా వినగానే తారకు భరించశక్యంగాని బాధతో గుండెలు బరువెక్కి, ఆ బాధ అంతా అక్కడ ఆగలేక గొంతులోకి ఎక్కి, అక్కడా ఉండలేక కళ్ళల్లోకి దూకి అక్కడనుండీ జాలువారు తున్నాది.

గుండెలు పిండేసే బాధలు ఎదురైనపుడు అరమరికలూ, కోపద్వేషాలూ — ఏవీ అడ్డురావు కాబోలు! సత్యవతి కోడల్ని కావలించుకుని భోరున ఏడ్చేసింది!

(ఇంకా వుంది)



'వయ్యారిభామలు – వగలమారి భర్తలు'లో కృష్ణ, ఎన్. టి. రామారావు

## మోహన్‌బాబు "ప్రతిజ్ఞ"

"పల్లెటూరి రాజకీయాలకు అద్దంపట్టే చక్కని ఇతివృత్తాన్ని ఎన్నుకున్నాం," అన్నారు హీరో మోహన్‌బాబు. ఈయన నిర్మించే శ్రీ లక్ష్మీప్రసన్న పిక్చర్స్ తొలిచిత్రం "ప్రతిజ్ఞ"కు మార్చి 19న తొలి గీతం రికార్డయింది. "అశేష ప్రేక్షకుల ఆశీస్సులతో నేనింతవరకు 145 చిత్రాలు పూర్తి చేయగలిగాను. హీరోగా, విలన్‌గా, కమెడియన్‌గా, కేరెక్టర్ ఆర్టిస్ట్‌గా మా గురువుగారు దాసరి నారాయణరావుగారు, నా శ్రేయోభిలాషులు కె. రాఘవేంద్రరావుగారిలాంటి సుప్రసిద్ధ దర్శకులు, నిర్మాతలు ఎందరో చక్కని పాత్రలనిచ్చి నా పట్ల ఎంతో వాత్సల్యం చూపారు. వారందరికీ నా తొలి చిత్ర ప్రారంభోత్సవ సందర్భంలో కృతజ్ఞత అర్పించుకుంటున్నాను. అసలు నా తొలి చిత్రాన్ని మా గురువుగారే రూపొందించవలసింది. వారి 60వ చిత్రం 'మేఘ సందేశం'. 70వ చిత్రం నాకు తీసిపెడ్తానంటూ, ఈలోగా నా తొలి చిత్ర నిర్మాణాన్ని కొనసాగించమని ఆశీర్వదిస్తూ, సలహాలు సూచించారు. నేను అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేసే రోజుల్లో రచయిత సత్యానంద్, డైరెక్టర్ బోయిన సుబ్బారావులు కూడా అసిస్టెంట్‌లుగా ఉంటూ నాకు మంచి మిత్రులయ్యారు. అంచేత నా పిక్చర్ రచన, దర్శకత్వ బాధ్యతలను వారికే అప్పగించాను. అసలు నేనిదివరకే బోయిన సుబ్బారావు డైరెక్ట్ చేసిన 'బంగారు చెల్లెలు, ఎంకి నాయుడుబావ' చిత్రాల్లో నటించవలసింది. కాల్‌షీట్లు అడ్జస్ట్ కాలేదు. ఇకపోతే, నా పిక్చర్ గురించి నేనెక్కువగా చెప్పకోకూడదుగాని, ఒకటి మాత్రం చెప్పక తప్పదు. అదే నా పాత్ర హీరోగా నా అంతస్తును మరింత పెంచే పాత్ర," అన్నారు మోహన్‌బాబు. ఇతర ముఖ్య పాత్రధారులు: సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, త్యాగరాజు, సారథి, ఆనందమోహన్, మాడా, భీమరాజు, పి. జె. శర్మ, కవిత, అరుణ, పుష్పలత, కృష్ణవేణి. ఎం. డి. సుందర్ కథ, స్క్రీన్‌ప్లే రాశారు. ఆత్రేయ గీతాలకు సత్యం స్వరకల్పన చేశారు. ఇంకా – పుష్పాల గోపీకృష్ణ, శ్రీనివాసరాజు, మార్తాండ్, వై. నాగేశ్వరరావు, బి. నారాయణరావు, టి. ప్రభాకర్, బెల్లం ప్రకాష్, మురళి, సత్యం తెరవెనుక కృషి చేస్తున్నారు. "ఏప్రిల్ 2 నుంచి 25 వరకు తిరుపతి, రాజమండ్రి ప్రాంతాలలో షూటింగ్... మే నెలలో డబ్బింగ్, రీ రికార్డింగ్... జూన్‌లో విడుదల..." అన్నారు డైరెక్టర్ బోయిన సుబ్బారావు.

'భక్త ధ్రువ–మార్కండేయ'లో శోభన



## ఎన్. టి. ఆర్., కె. రాఘవేంద్రరావుల కాంబినేషన్‌లో "జస్టిస్ చౌదరి"

"రామారావుగారి కీర్తి కిరీటంలో "జస్టిస్ చౌదరి" పాత్ర మరో కలికితురాయి కాగలదు," అన్నారు డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు. విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "జస్టిస్ చౌదరి" చిత్రంలో శ్రీదేవి శారద, జయంతి, రాజ్యలక్ష్మి, అరుణ, సుభాషిణి సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు అల్లు రామలింగయ్య, నాగేష్, రాజా, శ్రీధర్ పాల్గొన్నారు. సత్యానంద్, వేటూరి, చక్రవర్తి కె. ఎస్. ప్రకాష్, భాస్కరరాజు, సత్యం, రాజ ప్రభృతి సాంకేతిక సారథ్యం. "డబ్బింగ్, రీ రికార్డింగ్ అంతా పూర్తయ్యాయి. ఏప్రిల్‌లో రిలీజ్," అన్నారు నిర్మాత టి. త్రివిక్రమరావు.

## ఇల్లంతా సందడి

"కాశీవిశ్వనాథ్ మాటలు, సి. నారాయణరెడ్డి పాటలు రాస్తున్నారు. ఏప్రిల్, మే నెలల్లో 15–30 తేదీలమధ్య రెండు షెడ్యూల్స్‌తో పూర్తి చేస్తాం," అన్నారు నిర్మాత యు. ఎస్. ఆర్. మోహనరావు. ఈయన లోగడ నిర్మించిన "నేను–మా ఆవిడ, ఎమండోయ్ శ్రీమతిగారు" చిత్రాలకు ప్రతిభావంతంగా దర్శకత్వం నెరపిన రేలంగి నరసింహారావే రాజలక్ష్మి కంబైన్స్‌వారి ఈ కొత్త చిత్రం "ఇల్లంతా సందడి"కి కూడా దర్శకుడు. చంద్రమోహన్, ప్రభ, నూతన్ ప్రసాద్, ప్రభాకర రెడ్డి, గిరిబాబు, నిర్మల, జయమాలిని వగైరా నట వర్గం. కృష్ణ–చక్ర సంగీతం, బి. కోటేశ్వరరావు ఛాయ, డి. రాజగోపాల్ కూర్పు తెరవెనుక హంగులు.

## సురేష్ ప్రొడక్షన్స్ కొత్త చిత్రం

"జూన్‌కు షూటింగంతా పూర్తవుతుంది," అన్నారు డి రామానాయుడు. ఈయన కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మించే కొత్త చిత్రం తొలి షెడ్యూల్ మార్చి 21 నుంచి 31 వరకు జరిగింది శోభన్‌బాబు, మోహన్‌బాబు, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, సారధి, రాళ్ళపల్లి, శ్రీదేవి, జయప్రద, రమాప్రభ, నిర్మల, పుష్పలత, గెస్ట్‌గా సత్యనారాయణ పాల్గొంటున్నారు సత్యమూర్తి కథకుడు చక్రవర్తి స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు కె ఎస్ ప్రకాష్ ఛాయ, ఎస్ కృష్ణారావు శిల్పం, మార్తాండ్ కూర్పు నిర్వహిస్తున్నారు రెండవ షెడ్యూల్ ఏప్రిల్ 25 నుంచి మే 6వరకు జరుగుతుంది

'చిన్నారి మనసులు'లో దిలీప్, మాయా



# సినిమా

## "అత్తకు తగ్గ అల్లుళ్ళు"

"డబ్బింగ్ అంతా పూర్తయిపోయింది. ఏప్రిల్‌కు రిలీజ్ చేస్తున్నా," అన్నారు నిర్మాత వాసంతి ఈమె, లావణ్య ఆర్ట్స్ పతాకంలో నిర్మించిన పై చిత్రం కథ గురించి టూకీగా చెప్తూ, "అభిరామి అనే జమీందారిణి తమ ఆస్తి, అంతస్తుకు తగ్గ యువకులు లభించే పక్షంలోనే తన కూతుళ్ళు సీత, గీతలకు పెళ్ళిళ్ళు చేస్తానని నిక్కచ్చిగా చెప్తుంది కాని, ఆస్తి ఉంటే అంతస్తు ఉండదు అంతస్తు ఉంటే గుణం ఉండదు ఇక ఈ జన్మలో తమకు పెళ్ళిళ్ళు జరగవని నిరాశ చెందిన ఆ కూతుళ్ళిద్దరూ స్వయంగా వరాన్వేషణకు పూనుకుంటారు చివరికి తల్లికి చక్కని గుణపాఠం నేర్పుతారు కూతుళ్ళుగా రాధ, విజయశాంతి, తల్లిగా రాజసులోచన, అల్లుళ్ళుగా సురేష్, మురళి భలే నవ్విస్తారు. కరాటే మణి ఫైట్స్ గగుర్పాటు కలిగిస్తాయి" అన్నారు మాటలు వీటూరి, పాటలు ఆత్రేయ రాశారు. జె వి రాఘవులు సంగీతం, లోకేష్ ఛాయ నరసింహారావు కూర్పు, అంజిరెడ్డి నిర్వహణ, రామనారాయణ దర్శకత్వంతో శ్రీనివాసన్ సమర్పించే ఈ చిత్రం ఏప్రిల్ విడుదల

## "మొండి ఘటం"

"చిరంజీవి, రాధిక నాయకా నాయికలు," అన్నారు అనంతలక్ష్మి ఇంటర్నేషనల్‌వారి పై చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే రాజాచంద్ర సత్యనారాయణ, గుమ్మడి, ప్రసాద్‌బాబు, రావి కొండలరావు, రాళ్ళపల్లి, మణిమాల ఇతర పాత్రధారులు భరత్ కధకుడు గోపీ మాటలు, ఆత్రేయ పాటలు రాశారు సత్యం, చెంగయ్య, వి రంగారావు, మార్తాండ్, పి శ్రీనివాస్ తెర వెనుక కృషి చేస్తున్నారు తొలి గీతం మార్చి 20న రికార్డయింది "ఏప్రిల్ 9 నుండి 28 వరకు గుంటూరులో మొదటి షెడ్యూల్ జరుగుతుంది ఆ తర్వాత మే 6 నుండి 15 వరకు జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్మాత దగ్గుపాటి భాస్కరరావు



'అత్తకు తగ్గ అల్లుళ్ళు'లో మురళి, రాధ

## యువ చిత్ర "ప్రొడక్షన్ నెంబర్–3"లో కె. రాఘవేంద్రరావు, కృష్ణంరాజు

"గోరింటాకు, సీతామాలక్ష్మి" లాంటి ప్రతిష్టాత్మకమైన చిత్రాలు అందించిన యువచిత్ర కొత్తగా ప్రారంభించిన 3వ చిత్రానికి మార్చి 20న తొలి గీతం ధ్వనిముద్రిక చేయబడింది కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో కృష్ణంరాజు, రాధిక, శ్రీదేవి, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డితో పాటు మరో ప్రముఖ నటి కూడా పాల్గొంటుందని ఈ చిత్రాన్ని సమర్పించే కె మురారి అన్నారు సత్యానంద్, కె వి మహదేవన్, ఆత్రేయ, కె ఎస్ ప్రకాశ్, జి జి కృష్ణారావు, వర్మ, హరి, ఎం రామారావు, డి యోగానంద్ తెరవెనుక కృషి చేస్తున్నారు "రాజమండ్రిలో ఏప్రిల్ 11 నుంచి 20 వరకు ఫస్ట్ షెడ్యూల్ జరుగుతుంది," అన్నారు ఈ చిత్ర నిర్మాత కె నరసింహులునాయుడు.




"నీ సినిమా విజయవంతం కావాలంటే,
పేరు మార్చు! 'పగలు' తీసేసి
'రాత్రి' అని పెట్టు చాలు!"

## కయ్యాల అమ్మాయి — కలవారి అబ్బాయిలో విశ్వనాథం వింత నాటకం

విశ్వనాథం (సత్యనారాయణ) ఫోన్‌లో తన కొడుకు కిరణ్ (చంద్రమోహన్)తో మాట్లాడుతున్నాడు "హలో, కిరణ్! హౌ ఆర్ యూ మై బాయ్?"

"నేను బాగానే ఉన్నాను, డాడీ!" అటు చివరి నుంచి కిరణ్ జవాబిచ్చాడు.

"అయితే, నాకో చిన్న సహాయం చేసి పెట్టాలి ఏం లేదు. మన ఫ్యాక్టరీకి కొంతమంది కొత్తవాళ్ళను అపాయింట్ చేశాము వాళ్ళు ట్రెయినింగ్ నిమిత్తం అక్కడికి వస్తున్నారు వాళ్ళ ట్రెయినింగ్ పూర్తయ్యే వరకు నువ్వు వాళ్ళకు గైడెన్స్ ఇవ్వాలి"

"నేనా! నాకేం తెలుసు, డాడీ? అయినా, ఇవన్నీ ..."

"నువ్వేం చెయ్యక్కర్లేదయ్యా! మన రంగలింగం కూడా అక్కడికి వస్తాడు, అన్నీ అతను చూసుకుంటాడు. నువ్వు కేవలం నామినల్"

"ఓ—కే, డాడీ! మీ ఇష్టప్రకారమే చేస్తాను."

విశ్వనాథం రిసీవర్‌ను పెట్టేసి, సగర్వంగా మీసం మెలివేశాడు. పక్కన అయోమయంగా చూస్తూ నిలుచొనున్న రంగలింగం (అల్లు)తో "చూడు, రంగలింగం! నువ్వు ఉషని తీసుకొని అక్కడికి వెళ్ళి ..." అని వాక్యం పూర్తిచేసేలోగానే రంగలింగం వెళ్లబోయాడు "కాస్త ఆగవయ్యా! నువ్వొక్కడివే కాదు"

"అవునండీ. మన రోసీనికూడా తీసుకెళ్తాను," అన్నాడు రంగలింగం

"అలాగే నీ భార్య కూడా వస్తోందిగా?"

రంగలింగం తృళ్ళిపడ్డాడు "ఆఁ! మా ఆవిడ వస్తోందా? అయితే ..."

"కనక, నే చెప్పేది జాగర్తగా విను నువ్వూ—రోసీ గిసీ కాదు, నీ భార్యా వెళ్తున్నారు అక్కడ కిరణ్ మావాడు అని ఉషకి తెలిసిందా? ఇక్కడ భజగోవిందాన్ని పనిలోంచి ఊస్టు చేసేస్తాను"

"పాపం! వాడేం చేశాడు సార్?"

"వాడి పోస్టు నీకివ్వటానికి"

"ఆఁ!" రంగలింగం తెరిచిన నోరు మూయకుండా అలాగే ఉండిపోయాడు

టి అప్పారావ్ సమర్పించే శ్రీ దాక్షాయణీ క్రియేషన్స్ "కయ్యాల అమ్మాయి — కలవారి అబ్బాయి" చిత్రానికి విజయకృష్ణ కధను, భమిడిపాటి మాటలను రాశారు కృష్ణచక్ర సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయతో చిత్తూరి వెంకట నగేశ్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ-బాధ్యతలు వహిస్తున్నారు

# ఇరుగు - పొరుగు

★ సుహాసినికి ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ టెస్ట్‌లలో — సినిమాటోగ్రఫీలో 85 శాతం, డైరెక్షన్‌లో 65 శాతం, ప్రొడక్షన్‌లో 55 శాతం మార్కులు వచ్చాయట. "సినిమాటోగ్రఫీ డిప్లొమాలో ఫస్ట్ వచ్చి ఏం ప్రయోజనం? నటిగా క్రమక్రమంగా బిజీ అయిపోయాను. నేను కెమెరా వుమన్‌గా పనిచేసిన మొదటి తమిళ చిత్రం 'పోలీస్ పోలీస్' సగంలోనే ఆగిపోయింది," అంది సుహాసిని. ఈమె తండ్రి చారుహాసన్ "ఆయిరం ముత్తంగళ్" అనే తమిళ చిత్రంలో గడ్డం తీసేసి నటిస్తున్నాడు. తొలుత ఆ పాత్రను (హీరోయిన్ రాధ తండ్రిగా) ముత్తురామన్ ఒకే రోజు ధరించి, అకాల మరణం చెందారు. ఇప్పుడా పాత్రను చారుహాసన్ ధరిస్తున్నారు.

★ "నాకు లాటరీలో 50 లక్షల బహుమతి వస్తే, కరుమారి అమ్మ దేవతకు ఒక అందమైన కోవెల కట్టిస్తాను," అంది జయమాలిని.

★ ఓ యువకుడు దర్శకత్వం చేపట్టిన మొదటి చిత్రం... తొలి రోజు షూటింగ్ జరుగుతూండగా అతని దగ్గిరికి అసిస్టెంట్ వచ్చి, "మిమ్మల్ని చూడ్డానికి మీ తల్లిదండ్రులు వచ్చారు," అన్నాడు. "వాళ్ళను కూర్చోమను. లంచ్ బ్రేక్ సమయంలో వచ్చి మాట్లాడ్తానని చెప్పు," అన్నాడా దర్శకుడు. అలాగే లంచ్ సమయంలో తల్లిదండ్రులను కలుసుకుని, "మీరిలా తరచు సెట్‌కు వస్తూంటే, నాకు చాలా ఇబ్బంది కలుగుతుంది" అన్నాడు. ఆ డైరెక్టర్ సందీప్‌రాయ్. అతని తండ్రి సత్యజిత్‌రాయ్.

★ ఆమధ్య సిలోన్ రేడియోలో శ్రోతల సందేహాలకు ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సమాధానాలిచ్చారు. ఒక శ్రీలంక శ్రోత "ఎం. ఎస్. విశ్వనాధం, ఇళయరాజా, శంకర్‌గణేశ్ — సంగీత దర్శకులలో మీకు నచ్చిన మీ పాట ఏది?" ప్రశ్నించాడు. దానికి బాలు "ఈ ప్రశ్నకు వివరంగా జవాబివ్వాలంటే అరగంట పైగా పడుతుంది గనుక, ఆ శ్రోతకు పోస్ట్‌ద్వారా ప్రత్యేకంగా జవాబిస్తాను," అని సమయస్ఫూర్తితో తప్పించుకున్నాడట.

★ జెమినీగణేశ్ కుమార్తె జయలక్ష్మి ఒక తమిళ చిత్రంలో బుక్ అయింది. నటి పుష్పలత కూతురు మహాలక్ష్మి కూడా ఏప్రిల్ 14 నుంచి నటించబోతోంది.

★ శివాజీగణేశన్ కొడుకు ప్రభు "మా నాన్నలా ఎవరైనా నటిస్తే, మా నాన్నను కాపీ చేశారంటారు. కాని, నేను అనుకరించకపోతే, తండ్రిలా నటించలేదు — అని విమర్శిస్తారు," అన్నాడు.

## అక్క మొగుడు - చెల్లెలి కాపురంలో ఆస్తి పంపకం - వేరే కాపురం

మోహన్ (రాంజీ) చేతిలో నోట్ల కట్టలను చూసి సుబ్బమ్మ (అత్తిలి లక్ష్మి) చకితురాలైంది. "ఇంత పెద్ద మొత్తం నీకెలా వచ్చింది బాబూ?", అంది.

"దొంగతనం చెయ్యలేదు లెండి," అన్నాడు మోహన్.

"ఈ సంగతి మీ నాన్నగారికి తెలుసా?"

"తెలుసు."

"ఆయనే ఇచ్చి పంపారా?"

"లేదు."

"మరి ... ?"

ఇంతలో జయ (కవిత) వస్తూ, "మోహన్—వాళ్ళ నాన్నగారితో ఆస్తి పంచుకొని, ఇంట్లోనుంచి వచ్చేశాడమ్మా," అంది.

"ఎంత పనిచేశావు, బాబూ!" సుబ్బమ్మ ముక్కుమీద వేలేసుకుంది.

"అంతకంటే మార్గం కనిపించలేదండీ ... త్వరగా ముహూర్తం పెట్టించి, మా పెళ్ళి జరిపించండి. నన్నే ఇంటివాణ్ని చేయండి," అన్నాడు మోహన్.

"అలాగే, బాబూ! ఇవాళే సిద్ధాంతిగారికి కబురు చేస్తాను," అంది సుబ్బమ్మ.

జయ ముఖం ప్రకాశవంతమైంది.

చంద్రమోహన్, ప్రభ, ముఖ్య గు వారితో చెరుకూరి జనార్ధనరావు నిర్మించిన సౌమ్య ఇంటర్నేషనల్‌వారి "అక్క మొగుడు — చెల్లెలి కాపురం" చిత్రానికి కట్టా సుబ్బారావు దర్శకుడు. ఆర్. ఎస్. రామరాజు నిర్వహణలో గుత్తికొండ వెంకటరత్నం సమర్పణ. ఏప్రిల్ విడుదల.

## నాలుగు స్తంభాలాటలో విధి ఆడించే ఆట

హాస్పిటల్ బెడ్‌మీద ఆలోచనలతో సతమతమైపోతున్న శారద (పూర్ణిమ), ఖిన్నవదనంతో వచ్చిన ప్రదీప్ (ప్రదీప్)ను చూడగానే లేవబోయింది ఆత్రుతతో!

"నరేష్‌ను కలవడానికి కుదరలేదు, శారదా! వాళ్ళ అన్నా వదినలు నన్ను కలవనివ్వలేదు...అక్కడ పెళ్ళి ఏర్పాట్లు జరిగిపోతున్నాయ్. ఇక నువ్వు నరేష్‌ను మరిచిపోక తప్పదు," ప్రదీప్ అన్నాడు జాలిగా. శారదకు పెద్దపెట్టున దుఃఖం ముంచుకొచ్చేసరికి "నిన్నెలా ఓదార్చాలో, నీ బాధ ఎలా తీర్చాలో నాకు పాలు పోవడంలేదు, శారదా! ఆ దేవుడు ఎందుకిలా నీ మీద కత్తిగట్టి, నిన్ను కన్నీటిపాలు చేస్తున్నాడో అర్థం కావడంలేదు. కాలమే ఈ గాయానికి మందు అని సరిపుచ్చుకోడానికి వీలుకాని పరిస్థితి, శారదా నీది. పెరిగే కాలం, నీలో పెంచే పాపం నిన్ను ప్రతిరోజూ రంపపు కోతకు గురిచేస్తాయి," అన్నాడు మరింత బాధగా. శారద అయోమయంగా చూసింది. ప్రదీప్ బలంగా నిట్టూరుస్తూ, "డాక్టర్‌గారు నువ్వు గర్భవతి అని చెప్పారు," అన్నాడు.

అంతే. శారద కళ్ళెదుట అగ్నిపర్వతం బద్దలయినట్లయింది

జంధ్యాల రచన, దర్శకత్వంలో ఎన్. కృష్ణంరాజు నిర్మించిన నవత ఆర్ట్స్ "నాలుగు స్తంభాలాట" చిత్రం త్వరలో విడుదలవబోతోంది. నిర్వహణ : ఎన్. అచ్యుతరామరాజా. ★



# ఊహాల ఉయ్యాల - 4

రంగుల బొమ్మల కథ





















[ఇంకా ఉంది]



'సరోజ యింకా రాలేదేం ?' అనుకుంది సువర్చల విసుగ్గా.

ఉదయం భర్త శ్రీనివాసరావు ఆఫీసుకు వెళ్ళినప్పటి నుండీ ఖాళీగా కూర్చుంది. సువర్చలకు ఏమీ తోచడంలేదు భర్త వచ్చేటప్పటికి సాయంత్రం అయిదు దాటుతుంది. అప్పటిదాకా ఎలా గడుస్తుంది ?

ఇది సువర్చలకు రోజూ వచ్చే సమస్యే. అందుకే సరోజని రోజూ రమ్మంటుంది. ఓ రెండు గంటలు దానితో కబుర్లు చెప్పుకుంటే మిగతా టైము సినిమా పాటలతోటీ, కథలు, నవలలతోటే గడుస్తుంది. అయితే సరోజకి రోజూ వచ్చి రెండేసి గంటలు గడపడానికి వీలుండదు. రోజంతా ఊపిరిసలపని పని వుంటుంది. ఏడాది కొడుకు రాజా వున్నాడు. తలి టైములో సగం పైగా వాడి కోసమే సరిపోతుంది. తల్లి అవడం అంటే ఇరవై నాలుగు గంటల డ్యూటీ అంటుంది సరోజ. సువర్చల విషయం వేరు. సువర్చలకే ఆరు నెలలు దాటిన వయస్సు గల కూతురు రాజీ వుంది. కూతురు చేసుకోలేదు, సహజంగా ముఖపడాలను కుంటుందన్న వుద్దేశ్యంతో తల్లి సావిత్రమ్మే చూసుకుంటుంది రాజీ పనులన్నీ.

కాసేపు సినిమా పాటలు విన్నాక రేడియో ఆఫ్ చేసింది సువర్చల. ఇంక వినబుద్ధి కాలేదు. నవల ఒకటి వుంది కాని, అది మొదలుపెడితే ఒక్క వూపులో చదివితేనే గాని తృప్తి వుండదు. తనకి నెమ్మదిగా చదవటం అలవాటు కాబట్టి సాయంత్రానికి నవల చదవటం పూర్తి కాదు. మధ్యలో ఆపడం యిష్టంలేదు.

లోపల సావిత్రమ్మ యింటిపని, మనవరాలి పనితో హడావిడిగా వుంది.

సువర్చల కిటికీ దగ్గరకు వెళ్ళి చూసింది సరోజ వస్తోందేమోనని. సరోజ వస్తూన్న జాడలేదు.

సరోజ యిల్లు రెండిళ్ళవతల వుంది. ఇంట్లోంచి కదిలితే నిమిషంలో వస్తుంది. కానీ, యింట్లోంచి కదలదు.

సువర్చల ఫ్లాస్కులో కాఫీ తాగి వారపత్రికలు తీసుకుంది. పేరు బాగున్న కధలు రెండు చదివింది మూడో కథ మొదలుపెట్టబోతోంటే వచ్చింది సరోజ రాజాను చంకన బెట్టుకుని.

"ఏం తల్లీ యిప్పుడా రావడం ? పన్నెండింటికి వస్తానని" అంది సువర్చల నిష్ఠూరంగా.

"బావుందే. పని కావాలా, లేదా ? అసలు వీడు రానిస్తాడని నే నమకోలేదు."

'పని పూర్తయిందని విప్పుడన్నావు కనుక? వదిలించుకుని రావడమే.'

'కబుర్లు చెప్పినట్లు కాదు. మొగుడికీ, పిల్లాడికీ, పని మనిషికి, పాల దానికి, చాకలి దానికి–ఇంతమందికి సమాధానం చెప్పితేగాని బయటపడటానికి వుండదు. అప్పటికి కూడ ఫోన్ వస్తుందనో, మా ఆయన కోసం ఎవరైనా వస్తారనో, వుండవలసి వస్తుంది. పెళ్ళి కానప్పుడయితే కాలేజీకి వెళ్ళినప్పుడు నోట్సులు కూడ తీసికెళ్ళకుండా వెళ్ళేవాళ్ళం. లెక్చరర్లు చెప్పింది వింటే వినేవాళ్ళం, లేకపోతే యింటికి వచ్చి హాయిగా పాటలు వినేవాళ్ళం. అలా గడుస్తుందా యిప్పుడు !'

సువర్చల పడక కుర్చీలో వెనక్కువాలి,

కళ్లు నగం మూసుకుని, 'అలా వుంటేనే నాకు యిష్టం' అంది.

ఇష్టం నాకూ వుందమ్మా. కానీ కుదరద్దూ నీ లాంటి అదృష్టవంతులకి కుదురుతుంది హాయిగా మేట్నీకి వెళ్లాలంటే వెడతావు నవలలు చదవాలంటే చదువుతావు, పాటలు వినాలంటే వింటావు. వెనకాల మీ అమ్మ వుంది అన్నీ చెయ్యడానికి. బిడ్డ తల్లివి అయినా హాయిగా స్వేచ్ఛగా వున్నావు' అంది సరోజ కొంచెం అసూయ ధ్వనిస్తూ వుండగా.

సువర్చల నవ్వింది. ఆ నవ్వు వెనక తృప్తి వుంది. గర్వం వుంది.

సరోజ కాకపోయినా, ఎవరైనా ఈర్ష్య పడదగ్గ స్వేచ్ఛ అనుభవిస్తోంది సువర్చల. ఎవరైనా ఈ మాట అన్నా యిలాగే గర్వంగా నవ్వుతుంది సువర్చల.

కూతురికి మొదటి నుండీ పనులు చెయ్యడం అలవాటు లేదనీ, బిడ్డ తల్లి అయాక ఆ పనులు అసలు చెయ్యలేదనీ సావిత్రమ్మ అంతా తనే పూనుకుని చేస్తుంది. కూతురంటే విపరీతమయిన అభిమానం సావిత్రమ్మకి. ఆ ప్రేమతోటే తన మామూలు యింటి పనులతో పాటు రాణి ఆలనా పాలనా కూడ అంతా తనే చూసుకుంటుంది సువర్చలని ఒక్కపని కూడా ముట్టుకోనివ్వదు. పని చేస్తే కూతురు తట్టుకోలేదని ఆవిడ భయం.

తెలతెలవారగట్టు పాపలేస్తే సముదాయించి, పాలు కలిపి పట్టడం దగ్గర్నుంచి, రోజు మొత్తం పనులన్నీ ఆవిడే చేస్తుంది.

# తల్లి చాటు తల్లి

వేడినీళ్లు కాచి రోజు విడిచి రోజయినా పాపకి తలంటి, సాంబ్రాణి పొగవేసి పుతికి యిస్త్రీ చేసిన బట్టలు వేసి పాపని పువ్వులా తయారు చేసి సువర్చలకి యిస్తుంది. సువర్చల కాసేపు పాపతో ఆడుకున్నాక అమ్మ కిచ్చేస్తుంది పాపకోసం వేరే మెత్తటి అన్నం వండటం. తినవని మారాం చేస్తే కబుర్లు చెప్పి తినిపించడం, సాయంత్రం మళ్ళీ స్నానం చేయించి వేరే బట్టలు వెయ్యడం, దెబ్బ తగులుతే మందు రాయడం లాంటి పనులన్నీ ఆవిడవే. డాక్టరు చెప్పినట్టు కాచి చల్లార్చిన నీళ్లే పడుతుంది పాపకి. చలిగాలిలో తిరగనివ్వదు - పంపులో నీళ్లు బురదగా వచ్చినా, కాలువ నీళ్లు వాడాల్సి వచ్చినా వాడుక నీళ్లలో పటిక, తాగేనీళ లో యిండుపకాయరసం కలుపుతుంది. తన నమ్మకాలు కూడ తను పాటిస్తుంది సువర్చల బాలింతరాలుగా వున్నప్పుడు చిన్నెమ్మ కథ చెప్పింది గురువారం, ఆదివారం పాపని బయటకి తీసికెళ్లదంటుంది. సంకులు పారే వేళ పాపని బయటకు వదలదు.

సువర్చలకి పాపగురించి చేసే పని ఏమీ వుండదు ఒకవేళ ఏ పనయినా చెయ్యబోయినా, కూతురు అలసిపోతుందని సావిత్రమ్మ చెయ్యనివ్వదు 'నిండా ఇరవై యేళ్లు దాటాయో లేదో మవ్వేం చేస్తావే యీ పనులన్నీ బంగారు తల్లిలా కూచో. అన్నీ నే చేసుకుంటాలే' అంటుంది. సినిమాకి తీసికెడతావన్నా యివ్వదు. 'పాప తలకింద చెయ్యేసి సరిగ్గా పట్టుకోలేక పోయిన దానివి మవ్వేం చేస్తావే యివన్నీ' అంటుంది. అంత సపోర్టు అమ్మ దగ్గర్నుంచి వచ్చాక సువర్చల యింక దిగులేమి లేకుండా హాయిగా రికామీగా తిరుగుతోంది.

సరోజకా అదృష్టం లేదు చిన్నప్పుడే తల్లి పోయింది సువర్చలా, సరోజా ఒకే కాలేజీలో చదువుకునే వాళ్లు. ఒక రోజు ఫస్ట్ వర్క్ వచ్చింది ఆ వార్త. సరోజ క్లాసులో నీరు తిరగడం సువర్చలకి ఈనాటికీ గుర్తు. సరోజ తండ్రి మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. సవతి తల్లి ఏదో సంబంధం చూసి పెళ్లి చెయ్యమని పోరింది. మంచి సంబంధం చూసి చెయ్యగల స్తోమత సరోజ తండ్రికి లేదు అందుకే ప్రసాదు అనే సామాన్య ఉద్యోగస్తుడితో సరోజ పెళ్ళి జరిగింది

అప్పుడు భర్తతో వెళ్ళిపోయిన సరోజ మళ్లీ ఏడాది క్రితం కనబడింది, ప్రసాదు కీ పూరు ట్రాన్స్ఫరు కావడంవల్ల. శ్రీనివాసరావు పనిచేస్తున్న ఆఫీసులోనే ప్రసాదు ఉద్యోగం కూడ ప్రసాద్ కలుపుగోలు మనిషి. శ్రీనివాసరావుతో ప్రసాదుకి స్నేహం కలిసింది. ఇళ్లు కూడ దగ్గరే కావడం యింకా వీలుగా వుంది.

ప్రసాదుకి సంపాదన సరిపోనంత కుటుంబ భారం వుండేది కానీ తమ్ముళ్లు చేతికి అందడంవల్ల కాస్త కమాన వూపిరి పీల్చుకోగల్గాడు.

ఈ చిన్న వూరికి బదిలీ అయాక సరోజ అత్తగారు రావడం తగ్గింది. కాలక్షేపం కావడం లేదనే సాకుతో ఆవిడ ఇక్కడ ఎక్కువ కాలం వుండకుండా విజయవాడలో ఉద్యోగం చేస్తున్న రెండో కొడుకు దగ్గరకు వెళ్ళిపోయింది.

సరోజ గర్భవతి అయింది ఆ విషయం రాసినా పుట్టింటివాళ్లు తీసుకువెళ్ళడానికి రారని అందరికీ తెలుసు. సరోజ బాధపడుతుందని ప్రసాదు ఆ ప్రస్తావనే తీసుకు రాలేదు. అత్తగారు దెప్పుతుందేమోనని సరోజ విజయవాడలో అత్తగారింటికి వెళ్ల లేదు. ప్రసాదు ఎంత చెప్పినా సరోజ వినలేదు. కాన్పు సజావుగానే జరిగింది. బాలసారెకి మాత్రం అత్తగారు, ప్రసాదు తమ్ముళ్లు వచ్చి చూసి వెళ్లారు. ప్రస్తుతం ఎవరూ రావడం లేదు.



సరోజకి యింట్లో ఆడ సహాయం లేదు. అన్ని పనులూ సరోజవే. అందుకే ఎప్పుడూ తీరికలేని పనులతో సతమత మవుతూ వుంటుంది. స్నేహితురాలే అయినా సువర్చల జీవితం చూసి కొంచెం ఈర్ష్య పడుతుంది సరోజ. ఆ మాటే అంటే సువర్చల గర్వంగా చూస్తుంది.

* * *

సరోజ ఒక గంట వుండి పిల్లాడు ఏడుస్తూంటే యింటికి వెళ్ళిపోయింది.

అయిదున్నరకి శ్రీనివాసరావు వచ్చాడు. వస్తూనే ఒక వార్త తీసుకొని వచ్చాడు.

'నాకు కాకినాడ ట్రాన్స్‌ఫర్ అయింది' అన్నాడు వుత్సాహంగా.

కాకినాడ సువర్చల పుట్టి పెరిగిన వూరు. చదువు కూడా అక్కడే చదువుకుంది కాలక్రమేణ తండ్రి యీవూరు ట్రాన్స్‌ఫర్‌మీద రావడం, యిక్కడే రిటైరు అయి యిల్లు కట్టుకుని స్థిరపడటంతో తమకు యిదే స్వంతవూరు అయిపోయింది.

కాకినాడ ట్రాన్స్‌ఫర్ అంటే సువర్చల సంతోషంతో వుక్కిరి బిక్కిరి అవుతుందనుకున్నాడు శ్రీనివాసరావు.

కాని సువర్చల మామూలుగానే వింది.

ఒకక్షణం పోయాక 'ట్రాన్స్‌ఫర్ క్యాన్సిల్ చేయించుకోలేరా?' అంది.

'దేనికి?' అన్నాడతను ఆశ్చర్యంగా.

'నాకు ఇక్కడ వుంటేనే హాయిగా వుంది' అంది.

# తల్లి చాటు తల్లి

శ్రీనివాసరావు ఆలోచనలో పడ్డాడు. ఆమె తల్లి సావిత్రమ్మ ఈ వూరు వదలి రాదు. కాస్త కూస్త వున్న పొలాన్ని చూసుకుంటూ, రావలసినఅద్దెలు సక్రమంగా వసూలు చేసుకోవాలి అంటే ఈ వూరు వదలటం ఆమెకు అసాధ్యం.

విషయం అర్థం చేసుకున్న శ్రీనివాసరావు 'సరే రెండు నెలలు సెలవు పెడతాను. అప్పుడు ట్రాన్స్‌ఫర్ క్యాన్సిల్ కావచ్చు లేదా మళ్ళీ అక్కడికే వేస్తే, అప్పుడు ప్రయత్నించి ట్రాన్స్‌ఫరు అవుకోడానికి వీలవుతుందేమో చూస్తాను' అన్నాడు.

సువర్చల తృప్తిగా చూసింది. సువర్చలకి సంతోషం కలిగితే శ్రీనివాసరావుకి సంతృప్తిగా వుంటుంది

సువర్చల తృప్తికోసమే, ఆఫీసుకబుర్లన్నీ ఏరోజు కారోజు చెబుతూ వుంటాడు శ్రీనివాసరావు. అతి సామాన్య విషయాలైనా చెబుతాడు.

శ్రీనివాసరావు సిగరెట్ వెలిగించి కుర్చీలో కూర్చుని 'ఇవాళ ఒకటి జరిగింది. మా కృష్ణమూర్తి ఒక వారం శెలవు పెట్టాడని చెప్పానుగా. పని ఆగడానికి వీల్లేదంటూ ఆఫీసరు ఆ పనంతా ప్రసాదుకి ఒప్పజెప్పాడు.'

'ప్రసాదుగారు ఏమంటారు?'

''ఏమంటాడు. నీరుకారిపోయాడు కాదనటానికి వీల్లేనిది. పేమ కరెక్టుగా టైముకు పనవని, టైముకి ఇంటికి వెడతానని ఆయనకి తెలుసు. నన్ను పీడించడానికే నా పని యిచ్చాడు'' అంటాడు.

అలా మొదలయిన పని కథ వరుసగా మూడు రోజులు వింది సువర్చల. బలవంతాన మీదపడిన పనివల్ల ప్రసాదు విసుగ్గా వుంటున్నాడో, ఎల్లా ఆఫీసర్ని తిట్టుకుంటున్నాడో చెప్పాడు. రెండు రోజుల తర్వాత ఆ పని ఆఫీసరు మరొకళ్ళకి యిచ్చాడని చెప్పాడు.

* * *

దూరపు బంధువులెవరికో సుస్తీ చేసిందని కబురు రావడంతో, సావిత్రమ్మకి అర్జంటుగా వూరికి వెళ్ళాల్సిన పని తగిలింది. 'మూడు రోజుల్లో వచ్చేస్తాను ఈ లోగా పాపకి అన్నీ జాగ్రత్తగా చూడు.' అంటూ ఏవేమి చెయ్యాలో అన్నీ చెప్పింది. సువర్చల శ్రద్ధగా వినలేదు. నాలుగు రోజుల తర్వాత మళ్ళీ తల్లి తీసుకునే పని గురించి అంత శ్రద్ధగా వినాల్సిన అవసరం కనపడలేదు సువర్చలకి. 'ఈ మూడు రోజులూ ఎల్లా గడుస్తాయి ?' అన్న దిగులు పట్టుకుంది.

మొదటిరోజు బాగానే గడిచింది. రాజాతో బాగా ఆడుకుంది రాణి

రెండోరోజు రాణి ఎందుకో గుక్కపట్టి ఏడవటం ప్రారంభించింది ఎందుకు ఏడుస్తోందో సువర్చలకి తెలీలేదు. ఆకలేమోనని పాలు పట్టబోయింది. రాణి తాగలేదు. దాహం కాబోలని నీళ్ళు యివ్వబోయింది. అదీ వద్దని తోసేసింది రాణి కాసేపు చల్ల గాలిలో ఆరుబయట తిప్పింది. రాణి ఏడుపు ఆపలేదు.

సువర్చలకి కంగారు పుట్టింది.

పాప ఏడుపు విని సరోజ వచ్చింది. 'ఎందుకే పాప ఏడుస్తోంది?' అంది 'ఏమో అర్థం కావడంలేదు' అంది సువర్చల. సరోజ కూడ ఆడించింది. కానీ, పాప ఏడుపు మానలేదు.

సరోజ రాణి కడుపు పరీక్షించి 'పాప పొట్ట చూడు ఎల్లా బిగుసుకుపోయిందో. ఒక పని చేసి చూద్దాం' అంటూ లోపలికి వెళ్ళి పేరిన నెయ్యి తీసుకుని కడుపు మీద రాసి తియ్యటి కబుర్లుచెప్పి పడుకోబెట్టింది.

ఒక గంట పోయాక రాణికి ఉపశమనం కలిగి నవ్వుతూ వుండటం చూసి తృప్తి పడింది సువర్చల.

సంతోషంగావున్న సువర్చల మనస్సులోనే,



ఎక్కడో ఏదో తెలియని అసంతృప్తి వెలితి వున్నట్టు ఫీలవుతోంది. ఇదివరకు ఎప్పుడో ఒకసారి అమ్మ యిలా చెయ్యడం గుర్తుంది. కాని ఎందుకు చేసిందో అప్పుడు తనకు తెలియదు.

మూడు రోజులలో వస్తానన్న సావిత్రమ్మ నాలుగు రోజులయినా రాలేదు. సువర్చలకి విసుగ్గా వుంది. అప్పటికీ పనులన్నీ తగ్గిస్తోంది. పాపకు ఒక్కపూటే స్నానం చేయించి, వేరే అన్నం వండకుండా తాము వండుకున్న అన్నమే తినిపించి, కాచని నీళ్లే యిస్తున్నా, యింకా పని విసుగ్గా వుంది. వస్తానన్న టైముకు రానందుకు తల్లి మీద కోపం వచ్చింది. అసలే శ్రీనివాసరావు వూరికి వెళ్ళాడు. తల్లి వూళ్ళో లేదు. అందుకే కాసేపు తోడు కూర్చోమని ప్రసాదుని పంపించింది సరోజ.

కాసేపు ప్రసాదు రాణితో ఆడుకున్నాడు.

'ఆఫీసు కబుర్లే మయినా చెప్పండి' అంది సుజాత.

'ఇవాళ మా ఆఫీసులో రంగారావు అనే ఆయన రెండు నెలలు సెలవు పెట్టి వెడుతున్నాడు.' అన్నాడు ప్రసాదు.

'మీ ఆఫీసరు ఒప్పుకోలేదు. మామూలు కథేగా' అంది.

'అవును. కానీ తర్వాత ఒప్పుకున్నాడు.'

'ఎలా ఒప్పుకున్నాడు ?'

'ఆయనదేమీ లేదు. కింద వున్నవాళ్ళని బాధలు పెట్టడమే ఆయన పద్ధతి. ఎంత అవసరం అని చెప్పినా ఒప్పుకోలేదు. ఇంకో మనిషి తన పనితోబాటు రంగారావు సీటులో కూడా చేస్తానంటే సెలవు శాంక్షను చేస్తానన్నాడు. మామూలుగానే సెలవు యివ్వడు. ఇలా కండిషను పెడితే ఎవరూ ఒప్పుకోరని యిలా అన్నాడు.'

'చివరికెలా యిచ్చాడు ?'

'రంగారావు పని నేను చేస్తానన్నాను.'

'మీరా ?' అంది సువర్చల ఆశ్చర్యంగా. అంతలోనే సర్దుకుని 'మీరు యిదివరకు ఆఫీసరు ఒకసారి పనియిస్తే ఆయన్ని తిట్టారటగా !'

'నిజమే. నా పద్ధతే అది. అయిదింటి దాకా పనిచేస్తే నా పని అవుతుంది నాకు. నేను అయిదింటికి వెళ్ళిపోతే ఆయనకు బాధ, అందుకే అప్పుడు తిట్టుకున్నాను.'

'ఇప్పుడెందుకొప్పుకున్నారు ?' అని సువర్చల అడగలేదు. రంగారావు ప్రసాదుకి చాల ఆప్తుడని శ్రీనివాసరావు చాల సార్లు చెప్పాడు యిది వరకు.

'రేపటి మంచి మీకు కష్టంగా వుంటుంది' అంది సువర్చల సామభావతిగా.

'ఉండదు. కోరి బాధ్యత నెత్తి మీద వేసుకుంటే ఎంత పనైనా కష్టం అనిపించదు. సమర్థతా, ఓపికా కూడా అవసరానికి తగ్గట్టు పెరుగుతాయి' అన్నాడు.

బయట రిక్షా ఆగిన చప్పుడు వినబడటంతో సువర్చల గుమ్మం దగ్గరకు వెళ్ళి చూసింది.

తల్లి రిక్షా దిగుతోంది.

సువర్చల సంతోషంగా వెనక్కివచ్చి, రాణిని ఎత్తుకుని సంచీపట్టుకుని వస్తున్న అమ్మకు అప్పగించేసింది.

"నేను వస్తానమ్మా" అంటూ ప్రసాదు వెళ్ళిపోయాడు.

సువర్చల హాయిగా, స్వేచ్ఛగా పరుపు మీద పడుకొని నవల చదవబోయింది. కానీ ఎందుకో చదవ బుద్ధికాలేదు. ఆలోచనలు వస్తున్నాయి. ఆలోచించాలనిపిస్తోంది.

* * *

పని ఎక్కువ కావడంతో ప్రసాదు ఎక్కువగా ఆఫీసులోనే వుంటున్నాడు. సరోజ ఒంటరిగా వుంటుందని సువర్చల ఎక్కువగా సరోజ యింట్లోనే వుంటోంది. తీరిగ్గా సరోజని గమనిస్తోంది. సరోజ రాజాని ఎత్తుకునే తన పని చేసుకుంటోంది. బియ్యం కడిగి పొయ్యి మీద పెడుతూంటే, రాజాకి బొమ్మలిచ్చి ఆడుకోమంటోంది. స్నానం చేయిస్తూ తోచిన కథలు చెబుతోంది. జుట్టు దువ్వుతూంటే రాజా బయటకు పారిపోతూంటాడు. వాడెక్కడికి వెడితే వాడి వెంట అక్కడికి వెడుతూ మొత్తానికి జుట్టు దువ్వుతూ బట్టలు తొడగడం ఒక యజ్ఞం, విప్పడం ఒక యజ్ఞం. తలంటి పొయ్యడం అనేది చాలా ప్లాన్ చేసి చెయ్యవలసిన పని. వాడికి ముందుగా ఒక బిస్కట్టు యిచ్చి, వాడది తింటూ వుండగా వాడికి తెలియకుండా వంటికి నూనె, రాయాలి. తెలిస్తే వెళ్ళిపోతాడు. సున్నిపిండి రాసే ముందు పంచదార యివ్వాలి. మంచిది కాదని యిచ్చీ యివ్వనట్టు యిస్తుంది. తలంటిపోస్తున్నంత సేపూ వాడికి కుతూహలం కలిగించే కబుర్లు చెప్పాలి. అప్పుడు వినకపోతే ఒక దెబ్బ వేసి ఏడుస్తు వుండగానే తలంటి పోసేస్తుంది.

మామూలు ఆర్థిక బాధలూ, సంసారపు గొడవలూ వుండగానే, అన్నింటినీ మనసులో ఒక పక్కకి నెట్టి యివన్నీ చెయ్యాలి. అష్టావధానంలాంటి పనిలో మునిగిన సరోజకి సినిమాలుచూసే యోగమే లేదు. చూడాలన్న ఆసక్తి తగ్గించేసుకుంది. రేడియోలో మంచి పాటలు వస్తూంటే, కాసేపు ఆగి వినే తీరిక వుండదు. తన దగ్గరున్న పత్రికలు తీసుకో



## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ " ప్రత్యేక " సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥



మంటే, యిష్టమే అయినా తీసుకోదు. రాజా చంపేస్తాడని భయం.

రాజాకి ఒకరోజు జ్వరం వస్తే, సువర్చల వాళ్ళ యింట్లోనే పూర్తిగా వుండిపోయింది. డాక్టరు వచ్చి చూస్తున్నప్పుడు సరోజ కళ్ళలో ఆరాటం, మందులు వాడటంలో శ్రద్ధ, తగ్గినతర్వాత ఆమె కళ్ళలో సంతృప్తి గమనించింది సువర్చల

రంగారావు తిరిగి డ్యూటీలో జాయిన్ అయిన తర్వాత ప్రసాదుకి పని తగ్గింది. సరోజకి తోడు వుండాల్సిన అవసరం కూడ లేదు సువర్చలకి.

ఇంటికి వెళ్ళింతర్వాత సువర్చలకి, ఆలోచనలు పెరిగాయి. అంతేకాదు ఒక రూపానికి వస్తున్నాయి. ఇదివరకు హాయిగా నిద్రపట్టేది ఈ మధ్య పాప ఏడుస్తుంటే తెల్లవారగట్ల మెలకువ వస్తోంది. ఒకరోజు తను లేవబోతోంటే, అప్పటికే నిద్ర మేల్కొన్న తల్లి 'నీ కెందుకే, నేను చూసుకుంటాగా' అంది ప్రేమగా. ఆ తర్వాత రాణి బాగా పెంకితనం చేసి ఏడుస్తూంటే, తల్లి గట్టిగా రాణి వీపు మీద ఒక దెబ్బ వేసి వూరుకోమనడం చూసింది. నోటమాట రాలేదు. ఏదో అనబోయి ఆగిపోయింది. కళ్ళలో సన్నగా నీళ్ళు తిరుగుతున్నాయి.

* * *

శ్రీనివాసరావు వూరు నించి వచ్చాడు. సువర్చల అన్యమనస్కంగా వుండటం గమనించాడు.

'ఏమిటి అలా వున్నావు ?' అన్నాడు.

'ఏమీలేదు' అంది సువర్చల.

'కాదు ఎందుకో వుత్సాహంగా లేవు, అదోలా కనిపిస్తున్నావు.'

'ఏమీ లేదన్నాగా' అంది సువర్చల నవ్వి.

అది మామూలు నవ్వు లాగా లేదు. సువర్చల మామూలుగా అయితే చిన్నపిల్లలా నవ్వుతుంది. ఇప్పుడు ఆలోచనా పరురాలిగా వుంది.

'ఆఫీసుకు వెళ్ళివచ్చాను. రెండు నెలలు సెలవు పెట్టినా ట్రాన్స్ఫరు కాన్సిల్ కాలేదు' అన్నాడు.

ఇంకొంచెంసేపు ఆగి, 'ఇంకో రెండు నెలలు సెలవు పెట్టక తప్పేట్టులేదు.' అన్నాడు.

'తప్పుతుంది' అంది సువర్చల.

'అంటే'

'సెలవు పెట్టకుండా వుంటే సరి.'

'సెలవు పెట్టకపోతే జాయిన్ అవాలి.'

'అవండి'

శ్రీనివాసరావు ఆశ్చర్యంగా చూసి 'జాయిన్ అయ్యేది ఈ వూళ్ళో కాదు. కాకినాడలో' అన్నాడు.

'అక్కడే, నేను కాదన్నానా.'

'నువ్వు ?'

'నేనూ వస్తాను.'

''పాప ?'

'అదీ వస్తుంది.'

'పాప పనీ, యింటి పనీ రెండూ నేను కోవడం నీ వల్ల అవుతుందా ?'

'అందరూ చేసుకోవడంలేదూ ? అలాగే.'

'నీకు అనుభవంలేదుగా'

'అడిగి తెలుసుకుంటాను. కొన్నితెలుసు.'

'ఇంకోసారి ఆలోచించు. పాప నిన్ను సినిమాలు చూడనివ్వదు, పత్రికలు చదవనివ్వదు, రేడియో విననివ్వదు.'

'మానేస్తాను' అంది సువర్చల దృఢంగా.

సువర్చల అన్ని జవాబులూ స్థిరంగానే చెబుతోందని నిర్ణయించుకున్నాక 'ఇంక నేను జాయిన్ అవుతున్నట్లేగా' అన్నాడు ఆఖరిసారిగా.

'జాయిన్ అయి ఇల్లు చూసి నాకు వుత్తరం రాయండి. వస్తాను లేకపోతే యిల్లు చూడమని కాకినాడలో మీ స్నేహితులకి వుత్తరం ముందే రాయండి' అంది.

*　　*　　*

శ్రీనివాసరావు కాకినాడలో జాయిన్ అయాడు. ఇల్లు దొరికిందని వుత్తరం కూడ రాశాడు. కానీ అంత బాగాలేదనీ, ఇరుకుగా వుంటుందనీ రాసి 'కాస్త మంచి యిల్లు చూద్దామనుకుంటున్నాను, చూశాక వస్తావా' అని రాశాడు.

'ఇప్పుడే వస్తాను' అని రాసింది సువర్చల.

సావిత్రమ్మకు మాత్రం ఈ ప్రయాణం నచ్చలేదు. 'హాయిగా ఇంకో రెండు నెలలు సెలవు పెట్టి, అవసరమైతే ఎవరిచేతనైనా చెప్పించి, ట్రాన్స్ఫరు రద్దు చేయించుకోకూడదటే' అంది. ప్రయాణం అదేరోజు అని తెలిశాక కూతురు ఒక్కర్తీ అన్నీ చేసుకోగలదో లేదో అని దిగులు పడింది. కొంతలో కొంత మేలు అవుతుందని జాగ్రత్తలన్నీ చెప్పింది. 'వచ్చేది వేసవి కాలం. పాపకి వడదెబ్బ తగలకుండా చూడు. గది తలుపులన్నీ వేసి, కిటికీలకి తడిగుడ్డలు కట్టు. నీళ్ళలో ఒక వుప్పురాయి వేస్తూండు అప్పుడప్పుడు. తాగినన్ని నీళ్ళు యియ్యి...' అంటూ జాగ్రత్తలు చెబుతోంది.

సువర్చల బట్టలు సర్దుతూనే శ్రద్ధగా వింది అవన్నీ వుపయోగపడతాయని ఆమెకి తెలుసు

రిక్షాలు వచ్చేశాయి. సువర్చల పాపని ఎత్తుకొని రిక్షా ఎక్కింది. శ్రీనివాసరావు పెట్టెలు, సామానులు రిక్షా దగ్గరికి చేరవేస్తున్నాడు

కళ్ళల్లో నీళ్ళు తుడుచుకుంటూ, సావిత్రమ్మ వీడ్కోలు చెబుతూ వుంటే సువర్చల బరువైన గుండెతో అనుకుంది.

'అమ్మా. నువ్వు నన్ను అందరు తల్లులకంటే ఎక్కువగా అభిమానించావు నేను కష్టపడలేనని, నా పనంతా నువ్వే చేసిపెట్టావు. నేను బద్ధకస్తురాలననీ, శ్రమ పడలేననే వుద్దేశ్యంతో రాణికి చేసే సేవ అంతా చేశావు.

కానీ ... ...

నువ్వు యింత బాగా చేసినా నాకు ఒకరకంగా నష్టమే కలిగింది. ఏ పనీ నాకు చేతకాలేదు. పిల్ల ఏడిస్తే సముదాయించలేని అసమర్థురాలిని అయ్యాను పాపకి బాధగానీ, సుఖంగానీ కలుగుతే, నన్ను తలుచుకునే అదృష్టానికి కూడా నోచుకో లేకపోయాను. మాతృ ప్రేమకు హద్దులు లేవు గాని, తల్లిగా నీ ప్రేమ నన్ను దాటి నా కూతురు దాకా వచ్చింది. నీ అభిమానం నా వరకే వుండి, నాతో ఆగిపోతేనే నాకు సంతోషం. పాప మంచి చెడ్డలు నా పరిధిలో నేను స్వయంగా చూసుకుంటే వచ్చే తృప్తి నాకు కావాలి. నా బిడ్డని కొట్టినా నేనే కొట్టాలి.

ఇప్పుడు నాకు రాబోయే బాధ్యతలు నేను మొయ్యలేనని నీ వుద్దేశ్యం, మా ఆయన వుద్దేశ్యం కూడా. కానీ కోరి బాధ్యత భుజాల మీద వేసుకుంటే ఏపని అయినా చెయ్యగలరని పెద్దలుగారు అన్నారు. ఇప్పుడు నాకు సుఖాలు అనుభవించాలన్న కోరిక కన్నా ఊపిరి తిప్పుకోలేని పనుల్లో సతమతమవుతూ అయినా పాప ఆలనా పాలనా చూస్తున్న ఆనందం నాకు కావాలి. ఒక తల్లిగా నాకున్న ఈ హక్కుని నువ్వు కాదనగలవా ?

నాకు ఆనందం ఎక్కడ వుందో సరోజని చూసి గ్రహించాను.

'తల్లి చాటు తల్లి'గా నేను పొందే స్వేచ్ఛలో సౌఖ్యం కన్నా 'తల్లి'గా నేను పొందే కష్టంగాని, ఆనందం గాని నాకు ముఖ్యం. ఇవన్నీ నీకు నేను చెప్పలేను. మరో నాల్గికి నేను ఇక్కడికి రాను. నీకు నా మీద ప్రేమ వుంటే నా మనస్సుని అర్థం చేసుకో' అనుకుంది.

శ్రీనివాసరావు వచ్చి రిక్షా ఎక్కడంతో రిక్షాలు స్టేషన్ వైపు నడిచాయి.






**ఆర్. ఆర్. — మార్కాపురం**

నా వయసు 20 సం. లు. నేను మలము విసర్జించునప్పుడు మూత్రనాళము నుండి తెల్లటి ద్రవపదార్థము పడుచున్నది. ఈ విధంగా ఒక సంవత్సరం నుండి జరుగుతున్నది. మలము విసర్జించునపుడే ఇలా జరుగుతుంది.

ఎంల పదార్థం వెలువరించబడే సమయములో ఏర్పడే వత్తిడి ఎక్కువ పీడన శక్తివల్ల ప్రాస్ట్రేట్ గ్రంధి నుండ ప్రొస్టాటిక్ ఫ్లూయిడ్ వెలువడవచ్చు. మలం విసర్జనసమయంలో మాత్రమే ఇలా జరగటంవల్ల వేరే ఇతర కారణాలు ఉండటానికి అవకాశంలేదు. ఇది ఒక లోపం కానందువల్ల చికిత్స అనవసరం

**కె. ఎస్. — నెల్లూరు**

షుగర్ కంట్రోలు వచ్చి మందులు ఆపిన తరువాత ఇంక షుగర్ వచ్చే అవకాశం లేదా ?

తప్పకుండా ఉన్నది. ఆహార విషయంలో నియమం లేకుండా ఉంటే షుగర్ తప్పక వచ్చే అవకాశం ఉన్నది.

అడపాదడపా మూత్ర పరీక్ష, బ్లడ్ షుగర్ టెస్టు చేయించుకోవలసి ఉంటుంది.

**ఎమ్. ఆర్. ఎస్. — పెదవేగి**

నాకు ఒకసంవత్సరము నుండ రెండు పెదవుల చివరల్లో తెల్లగా ఉన్నది. మల పరీక్షలో పర్పులున్నాయన్నారు. వాటికి మందులు వాడాను. కాని పెదివుల చివర తెలుపు పోలేదు.

పెదివుల చివర తెల్లగా ఉండడాన్ని యాంగులర్ స్టొమటైటస్ అని అంటారు. కాంప్లెక్స్ విటమినులు లోపం వల్ల పుండు దనిపైన ఫంగస్ ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల ఇలా తెల్లగా ఏర్పడుతుంది.

ఆ తెల్లని ప్రాంతానికి జెన్షియన్ వయొలెట్ పెయింట్ పై పూతగా రాసి లోనికి బి. కాంప్లెక్స్ మాత్రలు రోజుకి ఆరు మాత్రలు (పూటకి రెండు) వంతున వరుసగా రెండు నెలలపాటు వాడండి.

**పి. కె. — కడప**

ముక్కు నాజూగ్గా చేసుకోవాలంటే ప్లాస్టిక్ సర్జరి ద్వారా చేసుకోవచ్చా? ప్లాస్టిక్ సర్జరి ఎక్కడ చేస్తారు? ఎంత ఖర్చవుతుంది? ఎన్ని దినాలు ట్రీట్‌మెంట్ చేయించాలి ?

ప్లాస్టిక్ సర్జరీ ద్వారా ముక్కు నాజూలుగా ఉండేటట్లు చేసుకనవచ్చును. మెడికల్ కాలేజీల ప్రాపకం ఉన్న అన్ని పెద్ద ఆసుపత్రులలోను ఈ చికిత్స చేయటం జరుగుతుంది. గుంటూరు, విశాఖపట్నం, హైదరాబాదు, మద్రాస్ వేలూరు మొదలైన నగరాలలో ఇలా చికిత్స చేయటం జరుగుతుంది.

ఖర్చు రోగి ఆర్థిక స్తోమతుని అనుసరించి ఉంటుంది. బీదలకి ఉచితంగా కూడా ఇలా చికిత్స చేయబడుతుంది.

ఎన్ని రోజులు పడుతుందనేది చేయబడిన ఆపరేషనుబట్టి, చేసిన సర్జన్‌నిబట్టి ఉంటుంది.

**సిహెచ్. వి. ఎమ్. - తణుకు**

నావయస్సు 16 సంవత్సరములు. నాశరీరంలో ఎదుగుదల కనిపించటం లేదు నేను ఎదగాలంటే ఏమి చేయాలి?

కొందరికి యుక్త వయస్సు ఆలస్యంగా రావటంవల్ల పెరుగుదల ఆలస్యం కావచ్చును.

ప్రోటీనులు. కాల్షియం ఎక్కువగల ఆహారం— పాలు పెరుగు, వెన్న, మాంసం, ఎప్పుదినుసుల మొదలయిన ఆహార పదార్థాలు ఎక్కువగా వాడుతూ రండి. మందులవల్ల పెద్దగా లాభం ఉండదు.

**వి. యస్. — గుంటూరు**

నా వయస్సు 19 సంవత్సరములు. నా కంటి క్రింది భాగము మీద నల్లని చారలు ఏర్పడినవి. అవి ఎలా పోవునో, ఎందువలన ఏర్పడునో తెల్పు ప్రార్థన.

అలసట, నిద్రలేకపోవటం, మానసిక ఆందోళన మొదలైన వాటివల్ల ఇలా చారలేర్పడతాయి. దీనిని పోగొట్టాలంటే పై వాటిని తగ్గించుకోవటమే చికిత్స. దీనిని పోగొట్టడానికి ప్రత్యేకచికిత్స లేదు. ●

## కాఫీ రుచిని అధికంచేసే క్రొత్త తయారీ విధానము
## కాఫీ తాజాతనాన్ని అధికంగా సంరక్షించే క్రొత్త పాకెట్

# క్రొత్త బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్







ఇప్పుడు బ్రూక్‌బాండ్ వారు ఉపయోగిస్తూన్న క్రొత్తతయారీ విధానంవల్ల క్రొత్త గ్రీన్‌లేబిల్ కాఫీ రుచి ఇదివరకు కంటే చాలా అమోఘంగా వుంటుంది.

అంతేకాదు ..బ్రూక్‌బాండ్ వారిచే ప్రథమంగా ప్రవేశపెట్టబడిన క్రొత్త 'కీప్-ఫ్రెష్' ప్యాకెట్ కాఫీపొడి అప్పుడే చేయించిన కాఫీపొడిలాగ చెమ్మ ఎక్కకుండా వారాలకొద్దీ ఎప్పటికప్పుడే తాజాగా వుంటుంది.

# క్రొత్త గ్రీన్ లేబిల్

### అమోఘమైన రుచి విశిష్టమైన తాజాతనము
### (ఇది బ్రూక్‌బాండ్ వారు మాత్రమే చేయగలరు)

ఎన్నిక చేసిన కొన్ని పట్టణములలో మాత్రం లభించును.

OBM 7148 TG

# సమాధానం

ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ



"నాన్నగారొచ్చే వేళయింది. కాస్సేపు చదువుకోరా! ఆయనొచ్చేసరికి మీరు చదువుకుంటుంటే ఆయనకు కొంత ఆనందంగా వుంటుంది" అమ్మ వంటింట్లో వంటపనులతో సతమత మవుతూనే అరుస్తోంది

నిజమే నాన్నగారొచ్చే టైముకి పుస్తకం పెట్టుకుని కూర్చోవాలి. కాని బయట గుడి ఆవరణలో సాంబుగాడు, ఆచారిగాడు, శేషగిరి అంతా కోతికొమ్మచ్చి ఆడుకుంటుంటె నా దృష్టి చదువు మీద ఎలా నిలుస్తుందీ!

కిటికీలో కూర్చుని పుస్తకం తెరిచాను. ఎదురుగా చెట్లెక్కి ఆడుతున్న నేస్తగాళ్ళు కనపడుతున్నారు. నా మీద నాకే చిరాకుగా ఉంది. సాంబుడు నాన్న రాత్రిళ్ళు క్లబ్ నించి ఆలస్యంగా ఇంటి కొస్తాడు. శేషగిరి నాన్న తాగుతాడట. తూలుతు ఏ పదిగంటలకో వస్తాడు. వాళ్ళు చక్కగా రాత్రి ఏనిమిది గంటలవరకు ఆడుకోవచ్చు. నాన్నగారిని చూస్తే ఒక్కొక్కప్పుడు భలే చికాకు వచ్చేస్తుంటుంది.

నాన్నగారికి మంచి పేరే వుంది. పోష్టుమాష్టర్ రామయ్యగారంటే అంతా చేతులెత్తి దండం పెడతారు. ఆరువందల జీతం, ముత్యాల్లాంటి ముగ్గురు పిల్లలు, ఇహ లక్ష్మిందేవిగారా! ఆవిడ సాక్షాత్తు లక్ష్మీదేవే అంటూ పొగుడుతూ ఉంటారు.

అంత మంచి నాన్నగారవటమే — నా చికాకుకు కారణం. పోష్టాఫీసు ఆరుగంటలకు కట్టేస్తే ఆరుగంటల పదినిమిషాలకు నాన్నగారింట్లో ఉంటారు. అక్కడ సైకిలెక్కడం ఇక్కడ దిగటం... సైకిలు దిగగానే అమ్మ ఎదురుగా వెళ్ళి ఫ్లాస్కు అందుకుంటుంది.

కాళ్లు చేతులు కడుక్కుంటూ ఇహ ఆఫీసు విషయాలన్నీ అమ్మతో చెప్పటం, అమ్మ కాఫీ చేసి ఇస్తే పడక కుర్చీలో కూర్చుని ముందు స్టూలు వేసుకొని కాళ్ళు బార్లజాపుకుని కబుర్లు ఆడటం... ఇలా పావుగంటో అరగంటో గడచిన తర్వాత అమ్మ వచ్చి స్విచ్ వేస్తుంది. దీపం వెలుగుతుంది. అమ్మ మంగళసూత్రాలు కళ్ళకద్దుకుని నాన్నగారి చేతికి పేపరిచ్చి వంటింట్లోకెళ్ళిపోతుంది.

ఇహ ఆ పేపర్ వళ్ళో వేసుకుని చదువుకోచ్చే! ఉహు, అలా చేస్తే నాకేం బాధ, అలా చేయరే!

"ఒరే కృష్ణా! లెక్కలెంతవరకు చేశావు?" ముందు అన్నయ్యతో మొదలెడతారు ఆ తర్వాత "ఏం చిన్న దొరగారు ఇంగ్లీషు పాఠం చదివేరా?" నన్నందుకుంటారు.

మహా ఓపిగ్గా చెబుతారు అర్థం కాని విషయాలు. అయితేనేం ... తలెత్తి చూస్తే గుళ్ళో కేరింతలు, ఆటలు... ఇహ చదువు మీదకు దృష్టి ఎలా పోతుంది?

ఆయనేదో అడుగుతారు, నేను తడబడతాను. అంతే! పుస్తకంలో వేలుంచి, కుర్చీలో వెనక్కి వాలి మొదలెడతారు పాఠాలు. పుస్తకంలో పాఠాలు కాదు, జీవిత పాఠాలు!

"చిన్నా! ఈ నీ వయస్సు కష్టపడి చదువుకోవల్సిన వయసు. ఇప్పుడు చదువుకోకుండా కాలక్షేపం చేస్తే జీవితాంతం ఇబ్బంది పడాల్రా! రాను రాను రోజులు మారిపోతున్నాయి వచ్చేవి గడ్డురోజులు ఈ రిజర్వేషన్లు, రికమెండేషన్లు, మనబోటి వాళ్ళకి ఉద్యోగం దొరకనివ్వవు. మనం మెరిట్‌లో ఉండాలి. మా ఆఫీసులో గుమాస్తా కొడుక్కి మెరిట్ స్కాలర్‌షిప్ వచ్చింది. నువ్వూ అలా సంపాదించాలి. అంటే కష్టపడి చదవాలి. నువ్వు గొప్పవాడివయితే నాకానందం కాదూ" ఇలా సాగిపోతుందా పాఠం.

ఆయన చెప్పేది కొంత బావున్నట్టే ఉంటుంది. ఏవేవో నిశ్చయాలు మనసులో చేసేసుకుంటాను. ఇంతలో అమ్మ భోజనానికి పిలుస్తుంది. వేడి వేడి అన్నం తిని పుస్తకం ముందేసుకుని కూర్చునేసరికి కునికిపాట్లు. నాన్నగారు బాలక్కకు లెక్కలు చెబుతుంటే, అక్క తిట్లు తింటుంటే కునికిపాట్లలోంచి నిద్రలోకి జారిపోతాను. ఆ తర్వాత అమ్మ నన్ను పక్కమీదకు ఈడుస్తుంది కాబోలు.

రోజూ ఇదే తంతు. నాకు గొప్ప చిరాకు. సాయంత్రం ఆరింటికే నాన్నగారెందుకు ఇంటికి రావాలి! కొంచెం ఆలస్యంగా ఇంటికొస్తే ఆయన సొమ్మేం పోయింది. ఈవాళ అర్జంటుగా నాన్నగారింటికి రావాల్సిన అవసరం నాకు గుర్తుకొచ్చింది.

"అమ్మా! ఈవాళ నాన్నగారు కేన్వాస్ షూస్ కొంటానన్నారూ?" గట్టిగా వంటింట్లోకి అరిచాను.

అమ్మ వంటింట్లోంచి ముఖం తుడుచుకుంటూ బయట కొచ్చింది.

"ఇప్పుడొచ్చి నిన్ను తీసికెళ్తానన్నారు! వచ్చే టైమయింది. రెడీగా ఉండు" అంది అమ్మ బొట్టు పెట్టుకుని.

"గాప్"

ఒకప్పుడు
నాన్నకూ నాకూ
జనరేషన్ గాప్!
ఇప్పుడు
మా పెద్దాడికీ
చిన్నాడికీ
జనరేషన్ గాప్!

— కవిత

"నే నెప్పుడో రెడీ! నేను నాన్నగారు వెళ్ళి బూట్లు కొనుక్కుంటాం!" అని అన్నయ్యను ఊరించి, అమ్మ కేసి తిరిగి "అమ్మా! నాన్నగారు కూడా హాఫ్ బూట్ కొనుక్కుంటారు కదమ్మా!" అడిగేను.

"ఏమో! ఆయనిష్టం" అంది అమ్మ.

నాన్నగారిలో ఇంకో నచ్చని విషయం ఉంది నాకు. నాన్నగారికి ఆరువందల జీతం. ఎప్పుడు ఇంట్లో డబ్బు ఉంటుంది. అయినా సరే ఆయనకోసం ఆయనేం ఖర్చుపెట్టుకోరు. ఆఫీసుస్టాఫ్ అంతా గణేశ్ భవన్‌లో పొట్టపగిలేటట్టు తింటారు నాన్నగారుతినరు. అమ్మచేసిచ్చిన డబ్బాలో టిఫిన్ తిని, ఫ్లాస్కు కాఫీ తాగుతారు. తాగేనీళ్ళు ఇంటినించే పట్టుకెళతారు. ఆఫీసులో నీళ్ళు శుభ్రంగా ఉండవంటారు. మహా చాదస్తం అనిపిస్తుంది నాకు.

నాన్నగారి జేబుఖర్చు నెలకు యాభై పైసలు! అదీ ఫస్టుతారీకు జీతం తీసుకునేటప్పుడు అంటించే స్టాంపుకి పది పైసలు, మిగిలిన నలభై పైసలు నెలమొత్తానికి సైకిలుగాలికి మాత్రమే. ఆయన ఖర్చు అంత తక్కువ. అలా అని మళ్ళీ మాకేం లోటు చేయరు.

మూడేళ్ళుగా దాదాపు నేను వింటున్నాను.

"హాఫ్‌బూటు ఒకటి కొనుక్కోవాలి లక్ష్మీ" అమ్మతో అంటుంటారు.

"కొనుక్కోండి ఖర్చులు ఉంటునే ఉంటాయి" అంటుంది అమ్మ.

వారాలు, నెలలు, సంవత్సరాలు గడుస్తున్నాయి. ఆయన దగ్గర డబ్బు ఉండదా అంటె ఉంటుంది అదేంటో కొనుక్కోరు.

నిన్న అమ్మ గట్టిగా చెప్పింది—

"వందరూపాయలున్నాయి ... బిలుండే ఫస్టుగా. రేపు మూర్తిగాడితోపాటు మీరు హాఫ్‌బూటు కొనేసుకోండి" అమ్మ నొక్కి చెప్పింది. ఏంచేస్తారో మరి?

నా చూపులన్నీ గడియారం మీదనే ఉన్నాయి. ఆరుగంటల ఏడునిమిషాలయింది. మరో మూడు నిమిషాలలో నాన్నగారు వచ్చేస్తారు. కేన్వాస్‌షూస్‌తో తను రేపట్నించి డ్రిల్లుకెళ్ళవచ్చు తెల్లటి మేజోళ్ళు మల్లెపువ్వుల్లా ఉంటాయి.

అసలు నాన్నగారితో సైకిలుమీద బజారు కెళ్ళటమే గొప్పహాయి ముందు చిన్నసీటు మీద కూర్చుని తను, వెనక నాన్నగారు సైకిలు తొక్కుతూ ఉంటారు తెలుసున్నవాళ్ళు నాన్నగారికి నమస్కరిస్తారు. అప్పుడు తనకెంత గర్వమో!

గుమ్మంలో బెల్ చప్పుడయింది. నాన్నగారొచ్చేసారు. అమ్మ ఎదురెళ్ళి చేతిలో సంచీ అందుకుంది. నన్నుచూపి—

"మీ కోసమే ఎదురుచూస్తున్నాడు" అంది. నాన్నగారు నవ్వేరు.

మరో పదినిమిషాల తర్వాత నాన్నగారు ముఖం కడుక్కుని, కాఫీతాగి, బజారుకి బయల్దేరారు. నాకెంతో ఉల్లాసంగా ఉంది.

అమ్మ పెట్లోంచి డబ్బుతెచ్చి ఇచ్చి "వెళ్ళిరండి" అంది.

"ఇంత డబ్బెందుకూ! ఇరవై చాలు" అన్నారు నాన్నగారు.

"మీరూ హాఫ్ షూ కొనుక్కోండి" అంది అమ్మ.






బులుసు వేంకటరమణయ్య

## ఉత్సవాల ప్రయోజనం

మనకు ప్రతిసంవత్సరమూ కొన్ని పర్వాలూ పండుగలు వస్తూ ఉంటాయి. ఇవి సామాన్యంగా మతాలకు సంబంధించినవి. కొన్నిటిని సామాన్యంగా జరుపుకున్నా కొన్నిటిని ఆర్భాటంగా జరుపుకుంటారు. విశిష్టమయిన ఉత్సవాలలో వేడుకలు జరుపుకుని, ఆనందంగా కాలం గడుపుతారు. ఆ ఉత్సవాలకు బంధుమిత్రులను ఆహ్వానించి గౌరవిస్తారు. బంధువులనూ, మిత్రులనూ కలుసుకొనుటకు ఈ పండుగలు మంచి అవకాశం ఇస్తాయి. పవిత్రక్షేత్రాలలో జరిగే తిరునాళ్ళు ఇలాటివే! ఈ ఉత్సవాలలో బంధుమిత్రులను కలుసుకోవడమే కాక పవిత్ర క్షేత్రతీర్థాలలో స్నానం చేసిన ఆత్మసంతృప్తి, భక్తిభావంలో స్థిరతా ఏర్పడగలవు.

పెద్ద ఉత్సవాలు జరిగినప్పుడు విజ్ఞానదాయకములైన ప్రదర్శనాలు జరుపబడుతాయి. అవి మనసునకు వింతో ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ఆ సమయాలలో విక్రయానికి వివిధ వస్తువులతో అంగళ్ళు తాత్కాలికంగా ఏర్పడతాయి. అందువల్ల వివిధములైన విచిత్రవస్తువులను సంపాదించడానికి కూడా వీలు ఉంటుంది. మతాలతో సంబంధంలేని ఉత్సవాలలో అన్ని మతాలవారూ పాల్గొంటారు. మత సంబంధమైన ఉత్సవాలలో మిత్రుల ఆహ్వానాన్ని పురస్కరించుకొని ఇతర మతాలవారు సంతోషంగావచ్చి వారిని అభినందిస్తూ గౌరవిస్తారు. ఇట్లు హిందువుల ఉత్సవాలలో ముస్లిములు, వారి మతోత్సవాల్లో హిందువులూ పాల్గొంటారు. ఇలాగే క్రైస్తవులు మున్నగువారున్నూ. క్రైస్తవుల పండుగరోజుల్లో ఇతర మతస్థులు వారి యిండ్లకుపోయి, వారిని కలిసికొని వారికి శుభాకాంక్షలు అందజేస్తారు. ఇది పరస్పర మైత్రికి సూచకం: మైత్రిని వృద్ధిపొందించేది కూడా. కాని కొన్నిచోట్ల మూర్ఖపు పట్టుదలలవల్ల అవాంఛనీయ సంఘటనలు జరగడంకూడా ఉన్నది. ఒక మతానికి చెందిన ఉత్సవాల్లోనే ఊరేగింపులు జరపడంలో వేర్వేరు పార్టీలవారు కలహించి కొట్టుకోవడం జరుగుతున్నట్లు మనం పత్రికల వల్ల తెలుసుకుంటున్నాం. ఇట్టిస్థితిలో ఒకమతం వారు వేరొకమతం వారితో తగవులాడడంలో ఆశ్చర్యంలేదు. అలా కలహించడం అవివేకుల లక్షణం. పరస్పరమైత్రికి ప్రతీకలైన ఉత్సవాల పరమాశయమే దీనివల్ల దెబ్బ తింటున్నది. దీనిని గమనించి, ఉత్సవాల ముఖ్యప్రయోజనం గుర్తించి పరస్పరమైత్రికి అన్ని మతాల వారూ దోహదం చెయ్యడం మిక్కిలి అవసరం.

---

## సమాధానం

"ఇప్పుడుకాదు. తర్వాత చూద్దాం. ఇరవై వాలులే" అన్నారు నాన్నగారు.

చెప్పేనుకదా ... నాన్నగారంటే ఇందుకే నాకు చిరాకు.

*　　　*　　　*

సైకిలు చక్రం గిర్రున తిరుగుతోంది.

"ఒరే నాన్నా! జానకీ! కాలు లోపలకి పెట్టుకో చక్రంలో పడగలదు" హెచ్చరించేను జానకిని.

"ఏం ఫరవాలేదు డాడీ!" తేల్చేసింది జానకి కాన్వెంటు పిల్లకదా ధైర్యం జాస్తి. జానకి అంటే నాకు వల్లమాలిన అభిమానం. కారణం మా నాన్నగారి పేరు కావడమే.

తొలిచూలు నా భార్య ఏ బిడ్డను ప్రసవించినా మా నాన్నగారి పేరు పెట్టాలను కున్నాను. పెట్టాను. నాన్నగారిపేరు జానకి రామయ్యగారు. నా పిల్లపేరు జానకి.

"డాడీ! సత్యగారిలో 'ఎలిఫెంట్' పిక్చర్ ఆడుతోంది"

"ఆడుతోంది, అయితే ఏంచేద్దాం."

"చూద్దాం డాడీ! బావుందిట!"

"ఎల్లుండి నించి ఎక్జామ్స్ కదరా! బాగా చదవాలి. క్లాసులో ఫస్టు రేంకు రావాలి. అసలే రోజులు బాగోలేవు. ఆడాళ్ళయినా... మగాళ్ళయినా... చదువుకుని ఉద్యోగాలు చేస్తేకాని గడవని రోజులొచ్చాయి."

"ఫో డాడీ! రోజూ అదే లెసన్" నవ్వింది జానకి. నాకు నవ్వొచ్చేసింది. పసిపాపలా నవ్వేసాను.

ఇద్దరం బాటా కంపెనీ ముందు సైకిలు దిగి లోపలకు నడిచేం.

అరగంట తర్వాత తనకు నచ్చిన షూ ఏదో చెప్పింది జానకి. నలభై అయిదు రూపాయలకు బిల్లురాసి అందించేడు షాపువాడు. పర్సు తెరిచేను రెండువంద నోట్లున్నాయి. అందులో ఒకనోటు తీసి షాపువాడికిచ్చేను.

"డాడీ! డాడీ! మర్చిపోయారు" కంగారుగా అరిచింది జానకి.

"ఏంట్రా!"

"మీరన్నీ మర్చిపోతారు. మమ్మీ మిమ్మల్ని 'షూ' కొనుక్కోమంది." నవ్వింది వెక్కిరిస్తూ.

"తర్వాత కొనవచ్చులెమ్మా!"

"అలా రెండేళ్ళనుంచి చెబుతున్నారు. మీచేత పట్టుపట్టి కొనిపించమంది మమ్మీ. కొనుక్కోండి డాడీ!" చేయిపట్టుకుని మారాం చేస్తోంది జానకి.

ఏం చెప్పాలో తెలియక నేను మాట్లాడలేదు. "అన్నిటికీ తర్వాత ... తర్వాత... అంటారు పేద్ద..." అంటోంది జానకి.

సమాధానం ఏం చెప్పాలి! నా ప్రశ్నలకు, చికాకులకు సమాధానం పాతికేళ్ళతర్వాత అర్థమైంది. చెప్పినా... ఇప్పుడు నా సమాధానం జానకికి అర్థంకాదు... ఆమె కర్థం కావాలంటే మరో పాతికేళ్ళుపోవాల్సిందే... అప్పటికి కాని ఆమెకు సమాధానం దొరకదు.

# హైదరాబాద్ నోట్‌బుక్

## ఎన్. టి. ఆర్. కొత్తపార్టీ :

సుప్రసిద్ధ చలనచిత్ర నటుడు శ్రీ ఎన్. టి రామారావు నూతనరాజకీయపక్షం స్థాపనతో జంట నగరాలలో రాజకీయ చైతన్యం సినిమా చైతన్యం లాగ ప్రజాసామాన్యాన్ని ఆవేశించింది శ్రీ రామారావు తన పార్టీకి "తెలుగుదేశం" అని నామకరణం చేశారు. మార్చి 29 సాయంకాలం బహిరంగసభలో వివిధ రంగాలలోని 300మంది ప్రతినిధులతోరహస్య చర్చలు జరిగిన పిమ్మట నూతన రాజకీయపక్షం పేరు నిర్ణయం జరిగింది. పేరు కొత్తగాను, ఆడంబరంగాను లేక సామాన్య ప్రజల ఉచ్చారణకు అనుగుణంగా ఉందని పలువురు అప్పుడే ప్రశంసించారు. ఈ సందర్భంలో శ్రీ రామారావు ముక్తసరిగా ప్రసంగిస్తూ, ఇందిరాకాంగ్రెస్ దశాబ్దాల దుష్పరిపాలన తెలుగు వారి జీవితాన్ని దయనీయంగా చేసిందని,ముఖ్యమంత్రులను,మంత్రులను ఢిల్లీ పెత్తందార్లు చీటికీ మాటికీ మారుస్తూ, రాష్ట్ర సహజ సంపదను ప్రజలకు కాకుండా చేస్తూ, ఆంధ్రుల ఆత్మగౌరవానికి భంగ కరంగా ప్రవర్తిస్తున్నారని విమర్శించారు. అవినీతి అంతటా విశ్వరూపంతో ప్రత్యక్షంకావడం వల్ల ప్రజాసామాన్యం గౌరవంతో బ్రతకడమే దుర్భరమైందని, ఆయన ఉన్నారు కాలేజీలలో సహజమైన తెలివి తేటలకు గుర్తింపు లేదని, కాపిటేషన్ ఫీజుతో యోగ్యతలు వస్తున్నాయని ఆయన విచారం ప్రకటించారు. అందువల్ల ఆరుకోట్ల తెలుగువారి గౌరవ ప్రతిష్ఠలను కాపాడగల కొత్త పార్టీ, అవసరమైందని, ఈ పార్టీ పరిపాలన లోని అవినీతిని కడిగి వేస్తుందని ఆయన వివరించారు. "నా కుటుంబ బాధ్యతలను నేను పూర్తిగా నిర్వహించాను. ఇక ప్రజలకు సేవ చేయదలచాను." అని ఆయన నొక్కి చెప్పారు. మార్చి 29 ఉదయం మద్రాసునుంచి విమానంలో వచ్చిన శ్రీ రామారావుకు విమానాశ్రయంలో ఆయన అభిమానులు ఘనస్వాగత మిచ్చారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి లారీలలో వచ్చిన వందలాది అభిమానులు ఆయనను పూల మాలలతో ముంచెత్తారు అభిమానుల రద్దీని తగ్గించడానికి పోలీసులు లాటీచార్జి కూడా చేయవలసి వచ్చింది. అభిమానులు విమానాశ్రయంలో ఆయువప్పైన పైనుంచి పుష్పవర్షం కురిపించారు. విమానాశ్రయం వెలుపల వేచి ఉన్న వేలాది జనం శ్రీ రామారావు విమానాశ్రయంనుంచి వెలుపలికి రాగానే "ఎన్ టి ఆర్. జిందాబాద్" అనే నినాదాలు చేశారు. ఇటీవల ఇందిరా కాంగ్రెస్ నుంచి విడిపోయిన మాజీ మంత్రి శ్రీ నాదెండ్ల భాస్కరరావు, మరినలుగురు శాసనసభ్యులు ఎన్. టి ఆర్. కొత్తపార్టీలో చేరారు. కొత్తపార్టీ ఇందిరా కాంగ్రెస్‌లో విసుగెత్తిన వారినేకాక, ఇతరులను కూడా ఆకర్షిస్తున్నది. ఇందిరా కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ సత్యనారాయణరావు, ఎన్. టి ఆర్. కొత్తపార్టీపై చేసిన వ్యాఖ్యలు ఎవరినీ సంతృప్తి పరచడం లేదు. ఎంజి ఆర్‌కు, ఎన్ టి ఆర్‌కు చాలా వ్యత్యాసమున్నదని, ఎం జి ఆర్ చాలా కాలం ఒక రాజకీయపక్షంలోఉండి దానినుండి విడిపోయి మరొక పార్టీని పెట్టాడని, ఎన్ టి ఆర్‌కు ఎలాంటి రాజకీయ పూర్వానుభవమూ లేదని, ప్రజలకు చేసిన సేవ కూడా అత్యల్పమని శ్రీ సత్యనారాయణరావు చేసిన విమర్శ, ఇందిరాకాంగ్రెస్‌భయానికి తార్కాణమని రాజకీయ పండితులు భావిస్తున్నారు. కాంగ్రెస్‌కులాల ప్రాతిపదికతోనే అన్నివ్యవహారాలూ సాగిస్తున్నప్పుడు కొత్త పార్టీకి ఒక కులంవారు పూర్తిగా బాసట అయితే తప్పేమిటని వారు ప్రశ్నించారు. స్వాతంత్ర్యోద్యమంలో కొన్ని అగ్ర కులాలకన్నా ముందుకురికినవారు కమ్మవారు. వారిలో రాజకీయ చైతన్యం మాత్రమే కాక ఇతర రంగాలలో చొచ్చుకుపోయే చాకచక్యమూచాలాఉంది. ఇన్నేళ్ళుగా కాంగ్రెస్‌ను నమ్మిన ఆ కులంవారు ఒక్కరూ ఇంత వరకూ రాష్ట్ర ముఖ్యమంత్రి కాలేదు. ఆచార్య రంగా వంటి కురువృద్ధునికి కూడా తగిన పదవి లేదు. ముఖ్యమంత్రి పదవి ఒక కులంవారి గుత్తసొమ్మా?—అని ఒకనాయకుడుప్రశ్నించారు. "మా కులంవారికి దేనిలో లోటండీ? కాకతీయుల కాలంలోను, విజయనగర సార్వభౌముల కాలంలోను, తర్వాతను మేము ఉత్తమ పరిపాల కులం—రాజనీతిధురంధరులం కులం ప్రాతిపదికతో ఎన్నికలలో నిలబడితే ఆరేడు జిల్లాలలో పూర్తిగా మాకే మెజారిటీ వస్తుంది ఆ జిల్లాలలో 140 స్థానాలు మా వశమైతే, ఎలా ఉంటుంది పరిస్థితి?" అని ఆయన లెక్కలుచెప్పి ఎదురు ప్రశ్నవేశారు. "ఇంత వరకు గాంధీజీ సిద్ధాంతాలు నమ్మి కుల మత వర్గ రహిత సమాజ స్థాపనకు దోహదం చేస్తున్నాముగాని, కులమే ప్రధానమై రాజకీయాలు సాగితే మా కులానికి అడ్డు ఉండదుసుమా!" అని మరొకరు అన్నారు. ఏమైనా, ఎన్ టి ఆర్ పార్టీలో కులాల ప్రసక్తి లేదని ఎన్ టి ఆర్. అభిమాని ఒకరు స్పష్టపరచారు. ఏమైనా, జంట నగరాలలో సందడి హెచ్చుగానే ఉంది. ఈ సందడిలో మాజీ ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య వేరే పార్టీ పెడతారనే విషయాన్ని ఎవరూ పట్టించుకోవడంలేదు. "శ్రీ అంజయ్య నిన్నటి వరకూ అమ్మకొంగు పట్టుకొనితిరిగారు ఇప్పుడు వేరే పార్టీ అనడం అమ్మను బెదిరించి ఏదో లాయిలం సంపాదించుకొనడం కోసంతప్ప మరొకటి కాద"ని అభిజ్ఞులు అంటున్నారు. ఒకవేళ శ్రీ అంజయ్య కొత్తపార్టీ పెట్టినా, పెద్దగా అంగ బలం, అర్థ బలం లేనిది కాబట్టి, ఎవరి ఆదరణా ఉండదని, ఇందిరా కాంగ్రెస్‌కు కొమ్మగానో, రెమ్మగానో ఉంటుందని, ఎన్.టి.ఆర్. కు పోటీ ఏమాత్రం కాదని ఒక శాసనసభ్యుడు చెప్పారు.

## శ్రీ బాబుల్‌రెడ్డి విజయం :

రాష్ట్రంనుంచి రాజ్యసభకు జరిగిన ద్వైవార్షిక ఎన్నికలలో జనతా పార్టీ అభ్యర్థి శ్రీ పి బాబుల్ రెడ్డి గెలవడం ఎవరికీ ఆశ్చర్యం కలిగించలేదు గాని అత్యధికమైన వోట్లురావడం ఆశ్చర్యం కలిగించింది దీనినిబట్టి తెలుగువారు ఇందిరాకాంగ్రెస్ పట్ల ఎంత విసుగు చెంది ఉన్నారో తెలిసిందని ఒక ప్రతిపక్ష నాయకుడన్నారు. మరి కొంచెం తెలివి తేటలతో వ్యవహరించి ఉంటే, మరొక స్థానమూ ప్రతిపక్షాలకు వచ్చి ఉండేదని ఆ నాయకుడన్నాడు. అదెలాగండీ? అనడిగాను. మీకు తెలి

మహబూబ్‌నగర్ జిల్లా వనపర్తి లో మార్చి 14 న శ్రీ శ్రీ సన్మానసభలో ప్రసంగిస్తున్న మహాకవి శ్రీ శ్రీ సన్మానసంఘం అధ్యక్షులు డా॥ వి. బాలక్రిష్ణ వేదిక నలంకరించిన శ్రీయుతులు బి. గంగన్న, జ్వాలాముఖి, శ్రీ శ్రీ, మిరియాల రామక్రిష్ణ, చేకూరి రామారావు, మోదుకూరి నరహరి గార్లని చిత్రంలో చూడవచ్చు



యదులేండి, ఆరవ లెక్కింపులో గెలిచేవాడు మా వాడు మంరొకడు— అన్నారు ఆయన. ఏమైనా ఇందిరా కాంగ్రెస్ ఆరవ అభ్యర్థి, ప్రత్యేకంగా ప్రధాని అభ్యర్థి అయిన శ్రీ ఎం. ఎం. హాషిం పరాజయం పొందడం ఇందిరా కాంగ్రెస్ వారు అవమానంగా భావిస్తున్నారు. దాదాపు 30మంది పార్టీ ఆనతిని తిరస్కరించి ఉంటారని పరిశీలకుల అంచనా. ఈ పరాజయానికి కారకులెవరో తాను కనుక్కొంటానని ముఖ్యమంత్రి శ్రీ వెంకట్రామ్ అన్నారు. పరిశీలకులుగా వచ్చిన కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ మూపనార్ ఎలాటి వ్యాఖ్యానమూ చేయలేదు గాని, మరొక పరిశీలకుడు శ్రీ సీతారాం కేసరి మాత్రం కాంగ్రెస్ హైకమాండ్ ఈ విషయమై దర్యాప్తు జరిపి, ఇలాటి క్రమ శిక్షణ రాహిత్యానికి కారకులైన వారిని కఠినంగా శిక్షిస్తుందని అన్నారు. "త్వరలో ఎన్నికలు వస్తున్నాయి. కొత్తపార్టీ ఏర్పడింది. అక్కడికి వెళ్లి టిక్కెట్టు సంపాదించి గెలుస్తాము. ఈ బెదిరింపులకు భయపడేవారెవరు?" అన్నారు ఒక వినుగెత్తిన ఎం.ఎల్.ఎ. నా చెవిలో.

**ఉ ప శ్రు తి :**

ఏం సార్? ఎప్పుడు పార్టీ మార్చు?— అనడిగాను చాలాకాలంగా ఏ పదవీ లేని ఒక శాసన సభ్యుణ్ని. ఆగండి. గాలివాటం చూడాలి గదా?— అన్నారు ఆయన.

—తిరుమల రామచంద్ర



Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# మీరెవరి మదినైనా కలవర పెట్టాలనుకున్నప్పుడు

## అమాయకత్వం చిందించే బొట్టు పెట్టుకోండి.

మీ కనురెప్పలలో తత్తరపాటు,
నడకలో వయ్యారంతోపాటు
నొసట శింగార్ కుమ్‌కుమ్ బొట్టు
పెట్టుకు చూడండి.
శింగార్ రంగులలోని
అత్యుత్తమ పదార్థాలతో
తయారైంది, మీ హావభావాలకు
సరితూగేలా.. మీ బట్టల
అందాన్ని మరింత చేసేలా.




**శింగార్**

**కుమ్ కుమ్ బొట్టు**
**—భారతదేశపు**
**అత్యంత అందమైన**
**సౌందర్య తిలకం**

everest/80/SH/76/tl

## ఉగాది సంచిక

2—4—82 సంచిక ఉగాదివూహాలు ముఖచిత్రం అత్యంత ఆకర్షనీయంగా ఉంది. తెలుగు ప్రేమ, కాకతాళీయం రెండు చాలా బాగున్నాయి. చిత్రకారుడు గీసిన బొమ్మలు చూడ ముచ్చటగా, జీవకళ ఉట్టిపడుతున్నట్లు అనిపించింది.

చిట్టెల్ల వెంకట సుబ్రహ్మణ్యం
(దార్లంపూడి)

*  *  *

2—4—82 సంచిక ఉగాది వూహాలు శంకు గారి చిత్ర రచన పూర్తిగా హాస్యాన్నే గాక, చక్కని సందేశాన్ని అందించారు.

తెలుగు ప్రేమ, రిజిస్టర్ పోస్ట్ కథలు మా ఇంటిల్లిపాదిని ఆకర్షించాయి. ఇటువంటి మంచి కథలు చదివించినందుకు మీకు మా ధన్యవాదాలు. వ్యాసాలు, శీర్షికలు కూడా చాలా బాగున్నాయి.

పి. ఉమామోహన్ (కాశీబుగ్గ)

*  *  *

'ఉగాది వూహాలు' అను కార్టూను ముఖచిత్రంగా వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక లోని కార్టూనులు కడుపుబ్బనవ్వించాయి. ఈ వారం ప్రచురించిన నాలుగు కథలలో 'కాకతాళీయం'కథ నాకు చాలా బాగా నచ్చింది. ఈ కథ మనుషులలోని అనుమానాలు, ఎదుటి వ్యక్తులను అంచనాలు వేయటంలోని తప్పొప్పులను గుర్తించడం, మొదలైన మనుషుల బలహీనతల గురించి రాశారు. హాస్య కథ చాలా హాస్యంతో కూడి ఉంది. వూహాలఉయ్యాల బొమ్మల సీరియల్‌ను ప్రారంభించినందుకు అభినందనలు.

పి. వి. రామనాధరావు, విజయశ్రీ (మధిర)

*  *  *

తేది 2—4—82 పత్రికలో ప్రచురించిన ఉగాదివూహాలు ముఖచిత్రం చాలా బాగుంది. కథలు నాలుగు చాలా బాగున్నాయి, ముఖ్యంగా హాస్య కథ. సీరియల్సు చాలా ఉత్సాహంగా నడుస్తున్నాయి.

బి. తిప్పేస్వామి (కళ్యాణదుర్గ)



కార్టూన్ ముఖచిత్రంతో కడుపుబ్బ నవ్వించి కవ్వించి ,ఉగాదివచ్చడిరుచి మాధుర్యం చవిచూపించిన అందాల ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఉగాది సంచిక మా ఇంటిల్లపాదినీ ఆకర్షించింది.

లక్కరాజు ప్రఫుల్లచంద్ర,
శ్రీమతి ఏ. సవితాదేవి, ఉమాపతి (ధర్మవరం)

*  *  *

2—4—82వ తేదీన వెలువడిన ఆంధ్రపత్రిక లోని జోక్స్ బాగున్నాయి. సీరియల్స్ బాగా సాగుతున్నాయి.

వెలగల ఉదయ భాస్కరరెడ్డి (మార్టేరు)

*  *  *

ది. 2—4—82 సచిత్ర వారపత్రిక చాలా బాగుంది. మీరు ప్రచురిస్తున్న మనసు కథ సీరియల్ చదువుతున్నాము. ఈ సీరియల్‌ను ఎన్ని సార్లు చదివినా మళ్లీ మళ్లీ చదవాలనిపిస్తుంది. రచయిత్రి సీతాదేవికి మా థ్యాంక్స్. ఇందులో 'తెలుగు ప్రేమ' హాస్య కథ మాకు చాలా ఆనందాన్ని అందించాయి.

జాడి పెంటయ్య, స్వర్ణలతా పెంటయ్య
ఎస్. ఆనందరావు (ఇల్లెందు కాలరీస్)

*  *  *

ఉగాది సంచిక చాల బాగుంది. తెలుగు ప్రేమ, కాకతాళీయం, హాస్యకథ, రిజిస్టర్డు పోస్ట్— ఈ నాలుగు కథలూ ఈ సంచికకు ఆభరణాలు అన వచ్చును. సినిమా బ్యాలెట్ ఫలితాలు మాకుసంతృప్తి నిచ్చాయి. ఈ ఫలితాలు ఆంధ్ర ప్రేక్షకుల ఉత్తమ అభిరుచులను తెల్పుతున్నాయి.

విమలా శ్రీనివాస్ (నైవేలి)

మనసు కథ సీరియల్ సరికొత్త సస్పెన్సుతో చాలా ఇంట్రస్టింగ్‌గా సాగిపోతూంది. రచయిత్రికి మా అభినందనలు. హాస్య కథ హైలైట్.

టి. ఉమ (నర్సరావుపేట)

*  *  *

రెండు సీరియల్సులో తార నన్ను బాగా ఆకట్టుకొనుచున్నది. ఉగాది సంచికలోని కార్టూన్స్ నన్ను ఎంతగానో నవ్వింపజేసినవి. కథలు చాలా బాగుంటున్నవి.

దేవిసెట్టి రంగయ్య (శ్రీరంగపురము)

*  *  *

2—4—82 సంచిక చదివిన తరువాత ఎంతో తృప్తినిచ్చింది. కాకతాళీయం, తెలుగు ప్రేమ కథలు ఎక్సలెంట్‌గా ఉన్నవి. వ్రాసిన రచయితలకు ధన్యవాదాలు.

ఏ. మీనాకుమారి, ఏ. శేషాచార్యులు
(అనంతపురం)

*  *  *

ఉగాది సంచికలో ప్రచురించిన కార్టూనులు అన్నీ కమనీయంగా ఉన్నాయి. కథలలో తెలుగుప్రేమ ఒక చక్కని సందేశాన్ని అందించింది. రామసూరి గారి "చైతన్య పుష్పం" వెరైటీగా ఉంది.

పులపర్తి శ్రీరంగ, పులపర్తి రత్నమాల
(మొగల్తూరు)

*  *  *

2—4—82 ఉగాది సంచిక చక్కని కథలతో, కార్టూన్లతో సర్వాంగసుందరంగా ఉంది. 'మనసుకథ' అంతా సస్పెన్స్. 'తెలుగు ప్రేమ' కథ మరీ మరీ నవ్వించి చదివేలా చేసింది. రచయితకు థ్యాంక్స్.

మహమ్మద్ లతీపుద్దీన్ (రాజమండ్రి)

*  *  *

2—4—82 సంచికలో ప్రచురించిన హాస్య కథ మా ఇంటిల్లిపాదిని నవ్వించింది.

ఎల్. గోపాల్ (గొడవర్లి)

*  *  *

శంకుగారి కార్టూన్ ముఖ చిత్రంతో వెలువడ్డ ఉగాది సంచిక చాలా బాగుంది. శ్రీమతి హజరాగారి 'తార' సీరియల్ మంచి ఇంట్రెస్టింగ్‌గా ఉంది. 'హాస్య కథ' బాగా నవ్వపుట్టించి దుఃఖాంతమయింది. మొత్తం మీద ఈ సంచిక నన్ను బాగా ఆకర్షించినది.

వి. లక్ష్మణరావు (ఖర్గపూర్)

*  *  *

ఆ.వె. నాయకుండు మారి, నాయకుండున్ రాగ,
ఫలములేమి? యంచు—కలలు గన్న
ఆలుమగలు చిత్ర—మర్థమవ్! దుందుభి
వత్సరమ్మునందు—వరుసగాను.

డాక్టరు సమ్మెట శ్రీనివాసరావు (విశాఖపట్టణము)

(66 వ పేజీ చూడండి)

# ఉత్తరదేశపు వంటలు వంటకాలు

## మెథి పరోటా

గోధుమపిండి - 100 గ్రా, శెనగ ండి - 50 గ్రా, మెంతికూర - 50 ములు, ధనియాల పొడి - ఒకటిన్నర ్పూను, జీలకర్రపొడి - 1 టీ స్పూను, ు - 1 టీ స్పూను, వుప్పు, పసుపు ంత, కొత్తిమీర - 15 గ్రాములు, నె తగినంత.

మెంతికూర, కొత్తిమీర సన్నగా తరిగి, కడిగి ్ స్పూను నూనెతో నీళ్ళు ఇగిరిపోయే వేయించాలి తరువాత గోధుమపిండి, ండి పై మసాలా, మెంతికూర వేసి ాల పిండిలా కలుపుకోవాలి ఈ ు రొట్టెలలాగా వత్తుకొని, దానిమీద నెరాచి మడత పెట్టి రొట్టెల లాగా వత్తి డు వైపులా నూనె రాసి పెనముమీద ్కోవాలి.

## మూలీ పరోటా

ముల్లంగి దుంపలు - 3 గోధుమ డి - అరకిలో, పచ్చిమిరపకాయలు - 5, ాలు, వుప్పు, పసుపు - తగినంత, త్తిమీర కొంచెం.

ముల్లంగిదుంపలు కడిగి, సన్నగా తురిమి, ప్పువేసి పది నిముషాలు వుంచాలి. కోరు నీళ్ళన్నీ పిండి కోరు వేరుగా వుంచుకోవాలి. పచ్చిమిరపకాయలు, కొత్తిమీర సన్నగా తరిగి మూకుడులో టేబుల్ స్పూను నూనెవేసి ాలువేసి అవి చిటపటలాడాక పచ్చిమిరప కాయలు, ముల్లంగి కోరు, వుప్పు, పసుపువేసి ది నిముషాలు వేయించి పిండితో కలుపు ాలి పిండిని పైన చెప్పిన విధంగా ్తుకొని నూనెతో కాల్చుకోవాలి.

## ఆలు పరోటా

గోధుమపిండి 100 గ్రాములు, బంగాళా ంపలు - 100 గ్రాములు, ధనియాల - 1 టీ స్పూను, జీలకర్ర పొడి - టీ స్పూను, అల్లం (సన్నగా తరిగి) - గ్రాములు. పచ్చిమిరపకాయలు (సన్నగా రిగి) - 4, వుప్పు, నూనె - తగినంత. ఆలు వుడికించి, పొట్టుతీసి, వేడిమీదనే ుద్ద చేసుకొని వుంచుకోవాలి. గోధుమ



పిండి, ఆలు, మసాలాలు అన్నీ కలిపి పై విధంగా పరోటాలు వత్తుకొని కాల్చుకోవాలి.

## ఖైమా పరోటా

మాంసం ఖైమా - పావుకిలో గోధుమ పిండి - అరకప్పు, మైదాపిండి - 1 కప్పు, వుల్లిపాయలు - 2, అల్లం, వెల్లుల్లి - కొద్దిగా, పచ్చిమిరపకాయలు - 6, పసుపు - పావు టీ స్పూను, వుప్పు, నూనె - తగినంత. ధనియాలు, జీలకర్ర, లవంగాలు, దాసించెక్క - కొద్ది కొద్దిగా.

ధనియాలు, జీలకర్ర, లవంగాలు, దాసించెక్క పొడి కొట్టాలి ఉల్లిపాయలు సన్నగా తరగాలి. అల్లం, వెల్లుల్లి నూరుకోవాలి. నూనెలో వుల్లిపాయలు వేయించి ఖైమా, అల్లం, వెల్లుల్లి మిగిలిన మసాలా వేసి మాంసం మెత్తబడేవరకూ వుడకనివ్వాలి. దింపి గరమ్ మసాలా వేసి, మైదాపిండి, గోధుమపిండిలతో కలిపి పై విధంగా పరోటాలు వత్తుకొని కాల్చుకోవాలి

- మాధురి అమ్రిత

## మటర్ సబ్జి

కావలసిన వస్తువులు : పచ్చి మటర్ గింజలు - 1 పావు కిలో, పెద్ద ఉల్లిపాయలు - 2, అల్లం - 1 చిన్న ముక్క, పచ్చిమిర్చి - 4, వెల్లుల్లి రేకులు - 2, జీలకర్ర - అర టీ స్పూను.

చేయువిధము: ముందు మటర్‌లో కొద్దిగా నీరుపోసి వుడకపెట్టాలి. వుల్లిపాయి సన్నగా చెక్కుగా తరుక్కోవాలి అల్లం, మిర్చి, వెల్లుల్లి, జీలకర్ర మెత్తగా నూరుకోవాలి. బాణలిలో తగినంత రిఫైండ్ ఆయిల్ వేసి నూరిన ముద్ద, వుల్లి చెక్కు సన్నటి సెగమీద ఎర్రగా వేయించాలి. వేగిన తరువాత వుడికిన మటర్, వుప్పు, పసుపు, అర గ్లాసు నీరు పోసి కలిపి మూత పెట్టాలి. నీరు ఇగిరిం తర్వాత వేరే గిన్నెలోకి తీసుకోవాలి. గరం మసాలా ఇష్టపడేవారు దింపే ముందు అర టీ స్పూను మసాలా పొడి వేసి దింపుకోవాలి. ఇది రొట్టెలకి, పూరీలలో బాగుంటుంది.

- ఎం పి. రాణి



## ఉగాది సంచిక

నాటి పత్రిక ముఖచిత్రం ఉగాది వూహాలు కడు రమ్యంగా ఉంది. స్త్రీల సమస్యలకు కారణం ఏమిటి? వ్యాసం ప్రతీ స్త్రీని ఆలోచింప చేసేదిగా ఉంది. తరచు ఇటు వంటి వ్యాసాలు ప్రచురిస్తూ ఉంటే పల్లె వాసులమైన మా స్త్రీలకు ఎంతో విజ్ఞాన దాయకమైన విషయాలు తెల్సుకోడాని్కి అవకాశం ఉంటుంది.

ఎం. పద్మావతి, ఎం. సాయి గణేష్, పి.వి వరలక్ష్మి (సంపర)

* * *

శంకుగారి కార్టూన్ ముఖచిత్రంతో వెలు వడిన ఉగాది సంచిక మమ్ములను ఎంతో ఆకర్షించింది. ముఖ్యంగా తెలుగుప్రేమ, హాస్యకథ కడుపుబ్బ నవ్వించాయి. ఉగాది పచ్చళ్ల కార్టూన్స్ బాగున్నాయి. మనసు కథ, తార సీరియల్ ఎంతో ఉత్సాహాన్ని రేకెత్తించి మళ్ళీ మళ్ళీ చదివించేలా చేస్తున్నాయి. పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాము అంటే అతిశయోక్తి కాదు

ఎస్. చాంద్‌బాషా (పొదసపల్లి)

* * *

చూడ కనుల కింపు ఉగాది వూహలు. ముఖ చిత్రం సొంపు. అబ్బ ఎంత బాగుందండీ కార్టూన్

# ఉత్తరాలు

(4వ పేజీ తరువాయి)

ముఖ చిత్రం. చిత్రకారుడు శంకుగారికి, ప్రచురించిన మీకు శుభాభివందనలు. ఉగాది కార్టూన్స్ చదివి అందరం హాయిగా నవ్వు కున్నాం. ఉగాది పుట్టు పూర్వోత్తరగాథల. వసారుతిగారి ప్రత్యేక వ్యాసం వన్నె తెచ్చింది కథలలో తెలుగుప్రేమ, హాస్యకథ చదువు తున్నంత సేపూ పచ్చేంత నవ్వొచ్చింది. హాస్య కథలో హాస్యంతోపాటు సందేశం, చివరలో విషాదం కూడ ఉన్నాయి. మనసు కథ సీరియల్ మహా సస్పెన్స్‌గా ఉంది. సుజాత మనస్తత్వం మరీ అయోమయంగా విచిత్రంగా ఉంది. ఏమైనా తుదివరకు ఎదరు చూపులు తప్పవు. తార చాలా బాగుంది. నాగరత్నమ్మ లాంటి స్వార్థపరులైన తల్లులు వాస్తవంలో కూడా వున్నారు.

మోటమర్రి బేబీకళ్యాణి (బెండమూర్లంక)

* * *

ఈవారం (2—4—82) ఉగాది సంచికగా వెలువడిన పత్రికలో సర్వ రుచులు ఫలాస్వాదన చేయించింది. ముఖచిత్రం సూపర్బ్. హాస్యకథలు రెండూ తెలుగు ప్రేమ, హాస్యకథ చాలా బాగున్నాయి, చక్కటి శైలిలో సాగాయి.

రామమూర్తి "చైతన్య పుష్పం రేపటి తీయని ఆశలు, గుబాళింపులు విరిసాయి. 81—ఫిలిమ్ బాలెట్ విజే పత్రికా ముఖంగా నా జేజేలు.

పెన్మెత్స సూరిబాబు (హైదరాబా

* * *

ఉగాది కార్టూన్లు, వూహల ఉయా 1981 ఫిలిం బాలెట్ ఫలితాలు, ఉ పుట్టు పూర్వోత్తరాల గాథ వ్యాసము వె లైన ఆనంద దాయకములైన అంశాల అత్యంత మనోజ్ఞంగా ఉన్న ఉగాది సం ఉజ్జ్వల తారా హారం.

ఆకెళ్ల సుబ్బారావు (కందికు

* * *

ఈవారం ఉగాది ప్రత్యేక స అందంగా అత్యంత ఆకర్షణీయంగా 'ఊహలు' ముఖ చిత్రం గీసిన శ్రీ శంకు మా అభినందనలు.

'తెలుగు ప్రేమ, హాస్యకథ'లోని హ హాస్యానికి మేము కడుపుబ్బ నవ్వుకున్నా తార, మనసు కథ సీరియల్స్ రె అత్యంత ఇంట్రెస్టింగ్‌గా సాగుతున్నా ముందు ముందు ఏం జరుగుత అని వచ్చే సంచికకోసం ఎదురు చూ న్నాం. జి. శివశంకర్ రావ్ [గొల్లప్రో

* * *

ఉగాది సంచిక అట్టమీద శంకుగారి ఉ వూహలు బాగుంది. హాస్యం కథ వూ ఉయ్యాల చిన్న పిల్లలకు అక్షరాభ్యాస కార్య హాస్యకథ వాస్తవానికి దగ్గరగా ఉంది.

ఎస్. ఇందుముఖి (హైదరాబా

* * *

2—4—82 నాటి ఆంధ్ర సచిత్ర వా పత్రిక ఉగాది కర్టూన్ చిత్రం శం గారిది మృదురమ్యంగా, కడుహాస్యాన్ని అంద చింది. ఈ వారం కర్టూన్స్ అన్ని బా నాయి. ఉగాధి పుట్టు పూర్వోత్తరం గు గురించి నిపులంగా ఈ పర్వదినంనాడు ప్రా ఎంతైనా ప్రశంసనీయం. వూహల ఉం సీరియల్ కార్టూన్ కలర్‌లో ప్రచు చారు. ప్రతివారం కలర్‌లో ప్రచు వెరైటీగా ఉంటుంది. తెలుగుప్రేమ, హా కథలు బాగున్నాయి. మనసు కథ సీరి సస్పెన్స్‌తో సాగుతోంది. సుజాత పాత్ర చిత్రణ, ఆవిడ మనస్తత్వం, ఎ లోని భావపరంపర, ఆలోచనలు ఉత్సు కల్గిస్తున్నాయి. రచయిత్రి వాసిరెడ్డి సీతా గార్కి మా అభినందనలు.

వై. హేమసుందర్ రావు, హేమబిందు, ప్రో (డోర్నకల్)




**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Stree Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**